Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు  స్థాపితం: 1930  జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

Longest Living Newspaper in Telugu Journalism

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 1 • 7-1-2011 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# శ్రీకృష్ణ కమిటీ చెప్పిందేమీ లేదు!

అయితే మగబిడ్డ, లేకుంటే ఆడబిడ్డ పుట్టడం ఖాయమని జోతిష్యం చెప్పినట్లు తెలంగాణ మీద నివేదిక ఇచ్చింది శ్రీకృష్ణ కమిటీ. 11 నెలల పాటు కొన్ని వేల వినతిపత్రాలు పరిశీలించి, రాజకీయ పార్టీలతో రోజుల తరబడి చర్చలు జరిపిందే జరిపి, ప్రజల అభిప్రాయాల కోసం వూరూరు తిరిగిన ఈ కమిటీ చివరకు చెప్పింది ఏమిటయ్యా అంటే ఏమీ లేదు. తాను విన్న అభిప్రాయాలన్నింటినీ క్రోడీకరించి, సంక్షిప్తీకరించి, వివిధ వర్గాలు అడుగుతున్న కోరికలనే తన సూచనలుగా సమర్పించింది. రాష్ట్రాన్ని అయితే సమైక్యంగా వుంచి అభివృద్ధికి ప్రత్యేక బోర్డులను ఏర్పాటు చేయడం, లేకుంటే రెండుగా విభజించడం. విభజించడమే జరిగితే ఆంధ్ర తెలంగాణలుగా చీల్చడం, లేదంటే రాయలసీమ, తెలంగాణలు కలిపి ఒకటిగా, ఆంధ్రను వేరొకటిగా ఏర్పాటు చేయడం; తెలంగాణ అయితే హైదరాబాద్ రాజధానిగా లేకుంటే హైదరాబాదుతోపాటు నల్గొండ, మహబూబ్‌నగర్, రంగారెడ్డి జిల్లాలను కలిపి కేంద్రపాలిత ప్రాంతంగా చేసి ఉమ్మడి రాజధాని ఏర్పరచడం చేయాలన్నది శ్రీకృష్ణ కమిటీ సూచన. ఈ వాదనలన్నీ వివిధ రాజకీయ పార్టీలు, నాయకులు, ప్రజాసంఘాలు విన్పిస్తున్నవే తప్ప కొత్తవి కావు. అంత అధ్యయనం జరిపిన కమిటీ, వీటిలో ఏది రాష్ట్రానికి ఉచితమో స్పష్టంగా ఒక సూచన చేసి వుంటే ఆ కమిటీ వేసిన సార్ధకత లభించి వుండేది.

ఇప్పుడు రాజకీయ పార్టీల కింకర్తవ్యం ఈ నివేదిక అధ్యయనం చేసి, నిదానంగా తదుపరి చర్యలు తీసుకోవడమని అన్ని రాజకీయ పార్టీలకు విజ్ఞప్తి చేస్తున్నాడు హోమ్ మంత్రి చిదంబరం. కానీ ఆయన మొర విన్పించుకొనే రాజకీయ పార్టీ రాష్ట్రంలో లేదు. టిఆర్ఎస్ సంగతి తెలిసిందే. వారిది ఏకసూత్ర కార్యక్రమం. తెలంగాణ ప్రాంతం టిడిపి, కాంగ్రెస్‌లు కూడా అదే ఆవేశంతో వ్యవహారం చేస్తున్నాయి. ప్రత్యేక రాష్ట్రం కోరికలో తామే మాత్రం బలహీనంగా మాట్లాడినా టిఆర్ఎస్ తమను అధిగమించి పోతుందనే భయంతో ఇల్లెక్కి గొంతు చించుకొని మరీ కేకలు పెడుతున్నాయి. మొత్తానికి ఏడాది క్రితం నాటి పరిస్థితినే పునరావృతం చేసింది శ్రీకృష్ణ

కొరవ 14వ పేజీలో

# సూరి కథ ముగిసింది

రెండు దశాబ్దాలుగా రాష్ట్రంలో ఫ్యాక్షన్ కక్షలకు సంకేతంగా వెలుగొందిన మద్దెలచెరువు సూరి హత్యకు గురైనాడు. అయితే, ఫ్యాక్షన్ కారణంగా కాకుండా స్వంత అనుచరుల చేతిలో హీనమైన చావు చావడం విశేషం. అనంతపురం జిల్లాలో ఫ్యాక్షన్ రాజకీయాలకు కేంద్ర స్థానమైన మద్దెలచెరువు ఆదినారాయణరెడ్డి కుమారుడే ఈ సూరి అని పిలవబడే సూర్యనారాయణరెడ్డి. నలభై ఏళ్ల క్రితం ఆదినారాయణరెడ్డి మాట ఆ ప్రాంతంలో శిలాశాసనంగా చలామణి అవుతుండేది. నీలం సంజీవరెడ్డి వంటి జాతీయ నేత అదే జిల్లాకు చెందిన వాడైనప్పటికీ, స్థానిక రాజకీయాలలో మాత్రం మద్దెలచెరువు ఆదినారాయణరెడ్డి పెత్తనమే నడిచేది. ఆయన అనుచరుడిగా రాజకీయ జీవితం ప్రారంభించిన పరిటాల శ్రీరాములయ్యతో విభేదాలు ఆ రెండు కుటుంబాల మధ్య ఫ్యాక్షన్ హత్యలకు శ్రీకారం చుట్టాయి. శ్రీరాములయ్య పేద ప్రజల పక్షపాతిగా ముద్రపడి, భూస్వాముల భూములను ఆక్రమించి, పేదలకు పంచి పెట్టేవాడు. అప్పటికి భూసంస్కరణల చట్టం అమలులోకి రాలేదు కాబట్టి, ఆదినారాయణరెడ్డి వంటి వారు వేలాది ఎకరాలను స్వంతం చేసుకొని వుండేవారు. తమ భూముల మీదకు పేదలను ఉసికొల్పుతున్న శ్రీరాములయ్య పట్ల భూస్వామ్య కుటుంబాలన్నిటిలో ద్వేషం పెరిగింది. వారందరి తరపున మద్దెలచెరువు ఆదినారాయణరెడ్డి చొరవ చూపి, బస్సులో ప్రయాణిస్తున్న శ్రీరాములయ్యను దారుణంగా చంపించాడు. దానితో శ్రీరాములయ్య కుమారుడు పరిటాల హరి తండ్రి హత్యకు ప్రతీకారం తీర్చుకోవడానికి నక్సలైట్లతో చేతులు కలిపి, ఫ్యాక్షన్ రాజకీయాలు నడిపాడు. రెండు కుటుంబాల మధ్య తీవ్రమైన కక్షలు పెరిగిపోయాయి. ఆ హింసోన్మాదంలో మద్దెలచెరువు ఆదినారాయణరెడ్డి, ఆయనకు ముఖ్యుడైన మరొక ఎమ్మెల్యే స్థాయి రాజకీయవాది కనుముక్కల చెన్నారెడ్డి, పరిటాల హరి తదితరులు నెత్తుటి మడుగులలో తేలియాడారు. ఆ తర్వాత ఆ మంటను ఎగదోసే బాధ్యతను పరిటాల రవి, మద్దెలచెరువు సూరి, కనుముక్కల రమణారెడ్డి, ఓబుల్‌రెడ్డి వంటివారు చేపట్టారు. వీరి మధ్య నడిచిన ఫ్యాక్షన్ హింసలో ఎన్ని కుత్తుకలు తెగాయో లెక్కలేదు. కొన్ని వందల కుటుంబాలు నాశనమైపోయాయి. మద్దెలచెరువు సూరి కుటుంబాన్ని చంపడానికి పరిటాల రవి టివి బాంబు ప్రయోగం చేస్తే, రవిని చంపడానికి కారు బాంబు పేల్చాడు సూరి. వైఎస్.రాజశేఖర్‌రెడ్డి ముఖ్యమంత్రి అయిన కొద్ది కాలానికే పరిటాల రవిని హత మార్చగలిగాడు సూరి. అప్పటి నుంచి పరిటాల రవి అనుచరులు చెల్లాచెదురై పోయారు. మళ్లీ ఎన్నికలలో కూడా వైఎస్ ముఖ్యమంత్రి కావడంతో వారు తీవ్ర నిరాశకు గురై చెట్టుకొకరు పుట్టకొకరుగా వూళ్లు వదలి, అజ్ఞాతవాసానికి తరలిపోయారు.

ఈ నేపథ్యంలో సూరికి క్షమాభిక్ష ప్రసాదించి జైలు నుంచి విడుదల చేయించాడు వైఎస్.రాజశేఖర్‌రెడ్డి. దాన్ని అవకాశంగా తీసుకొని, సినిమాలలో చెప్పినట్లు స్టేట్ రౌడీగా ఎదిగాడు సూరి. హైదరాబాద్, విజయవాడ, విశాఖపట్నం, తిరుపతి వంటి నగరాలన్నిటిలో భూ ఆక్రమణలు, గూండా మధ్యస్థాలతో వందలకోట్లు కూడాబెట్టాడు. ఆ నెత్తుటి కూడు పంపకంలో అనుచరులతో వచ్చిన విభేదాలు ఆయన ప్రాణం తీయడం విధి విలాసం. తాను జైలులో వున్న కాలంలో రౌడీ పంచాయితీల ద్వారా సంపాదించిన అక్రమ ఆస్తులను భాను అనే ముఖ్య అనుచరుడి పేరు మీద పెట్టాడట సూరి. జైలు నుంచి బయటకు వచ్చిన తర్వాత కూడా సూరి తరపున ఈ భాను అనే అనుచరుడే పంచాయితీలు నడిపేవాడట. ఈ లావాదేవీలలో దాదాపు 80కోట్ల రూపాయల ఆస్తి భాను పేరిట కూడిందట. దాన్ని తిరిగి తన పేరు మీదకు మార్చమని సూరి గట్టిగా చెప్పడంతో, అంత పెద్ద ఆస్తిని వదలుకోవడం ఇష్టం లేక, సూరి మాటకు ఎదురు చెప్పే ధైర్యం లేక, మంచిగా వుంటూనే పక్కనే చేరి, తలకు తుపాకి గురిపెట్టి కాల్చిపారేశాడు భాను. రాష్ట్రం మొత్తంలో నేర సామ్రాజ్యానికి అధిపతిగా, తన పేరు చెప్తే పసి పిల్లలు కూడా పాలు త్రాగనంతటి క్రూరమైన ఫ్యాక్షన్ నేతగా, జైలు నుంచే అనంతపురం జిల్లాను గడగడలాడించడమే కాదు, తనకు ప్రమాదం అనుకొన్న వారిని జైలు గోడల మధ్యనే చంపించగల్గిన శక్తివంతుడిగా పేరుపొందిన సూరి, చివరకు ఒక అనామక అనుచరుడి చేతిలో హీనంగా చనిపోవడం, నేరస్తుల జీవితాలు చివరికెట్లా కడతేరుతాయో అన్న నిజాన్ని నిరూపించింది. సూరి మరణం తర్వాత అయినా అనంతపురంజిల్లాలో ఫ్యాక్షన్ హింస అణగారి పోతుందో లేక ఆయన కొడుకు మళ్లీ కత్తి పట్టి, కుత్తుకలు తెగనరకడానికి సిద్ధపడుతాడో వేచి చూడాలి.

జమీన్‌రైతు

## జనవాణి

### రైతు సంక్షోభంలో పడిపోయాడు!

రాష్ట్ర ప్రభుత్వం అనుసరిస్తున్న రైతు వ్యతిరేక విధానాలతో నేడు రాష్ట్రంలో రైతు సంక్షోభంలో పడిపోయాడు గాని, వ్యవసాయం సంక్షోభంలో వుండి కాదు. విత్తనాలు మొదలుకొని పంట మార్కెట్‌లో అమ్ముకొనే వరకు ప్రభుత్వం నుంచి రైతుకు ఎటువంటి సహాయం అందడం లేదు. అయినప్పటికీ రైతు తన స్వంత కాళ్లమీద నిలబడి వ్యవసాయం చేసుకొంటున్నాడు. కనీసం ప్రకృతి వక్రీకరించినప్పుడైనా రైతులను ఆదుకోవాల్సిన రాష్ట్ర ప్రభుత్వం మొండి చెయ్యి చూపింది. వ్యవసాయం లాభసాటిగాలేదని, వైపరీత్యాలు వచ్చినప్పుడు రైతులను ఆదుకోవాల్సిన బాధ్యత ప్రభుత్వానిది కాదని రాష్ట్ర ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి అనడం కాంగ్రెస్ పార్టీ అనుసరిస్తున్న ప్రపంచ బ్యాంకు అనుకూల విధానాలకు ప్రత్యక్ష నిదర్శనం. ఈ మాట అన్నందుకు భవిష్యత్తులో రైతాంగం కిరణ్‌కుమార్ రెడ్డికి, కాంగ్రెస్‌కు తగిన బుద్ధి చెబుతారు.

పి.శ్రీరాములు — కావలి

### ప్రతిపక్షాలు గట్టి పోరాటం చేయాలి!

ఎన్నడూ కనివినీ ఎరుగని రీతిలో పార్లమెంట్‌ను కేవలం 2-జి స్పెక్ట్రమ్ కుంభకోణంపై 22 రోజులపాటు స్తంభింప చేయడం జరిగింది. ప్రభుత్వం కూడా మంకుపట్టు పట్టి పార్లమెంటు జరగకున్నా పరవాలేదు అన్న ధోరణిలో దోషులను బయట పెట్టడానికి ఏమాత్రం ఇష్టపడడం లేదు. కారణం ఇందులో పెద్ద పెద్ద తిమింగలాలు బయటపడతాయని భయమా? దేశాన్ని ఆర్థికంగా గుల్లచేసి సామాన్య ప్రజల జీవితాలను దుర్భరంచేసే ఈ కుంభకోణాల ఊబినుంచి రక్షించేందుకు ప్రతిపక్షాలు అలుపెరుగని పోరాటం చెయ్యక తప్పదు.

టి.రమణయ్య — గూడూరు

### రాకెట్ ప్రయోగం విఫలంతో నిరాశ!

దేశ ప్రజలు ఎంతో ఆసక్తిగా ఎదురుచూసిన జిఎస్ఎల్వీఎఫ్-6 రాకెట్ ప్రయోగం విఫలం కావడం తీవ్ర నిరాశను కల్గించింది. కారణం ఏమైనప్పటికీ 325 కోట్ల రూపాయల వ్యయంతో రష్యా శాస్త్రవేత్తల సహకారంతో మన శాస్త్రజ్ఞులు రేయింబవళ్లు శ్రమించి రూపొందించిన ఈ రాకెట్ నింగికెగిసిన కొన్ని సెకన్లలోనే విఫలమవడం తీవ్ర దిగ్భ్రాంతికి గురి చేసింది. గతంలో మన శాస్త్రవేత్తలు రూపొందించి ప్రయోగించిన పిఎస్ఎల్వీ రాకెట్ విజయవంతంగా పని చేసి మన దేశ ప్రతిష్టను, మన శాస్త్రజ్ఞుల శక్తి, సామర్థ్యాలను ప్రపంచవ్యాప్తంగా కొనియాడేలా చేసింది. ఈ మధ్య రెండు ప్రయోగాలు విఫలం కావడంతో మన

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

10-1-1941
పేజీలు : 16 వెల: అణా

### అవీ - ఇవీ

డిక్టేటర్లు – అనగా నియంతలు ఎంత దర్జాగా, ఎంత నిర్భయంగా కాలం వెళ్లబుచ్చుతున్నా నిరంతర, మహాదారుణ ప్రాణభయం వారిని ఒక వంక వేధిస్తూనే వుంటుంది. దానికి తగువైన రక్షణలు వారెలా ఏర్పరచుకున్నారో గమనించారా?

ముసోలినీకి ఒక బలిష్టమైన సాయుధ పరికరాల మోటారు కారు ఒకటుంది. పెద్ద పెద్ద బుల్లెట్లు కూడా దాంట్లో దూరజాలవు. అతి రహస్యంగా దాంట్లో మర తుపాకులు అమర్చబడి వుంటాయట. ఆయ నెల్లప్పుడూ దాంట్లోనే ప్రయాణం చేస్తాడట ప్రాణాలరచేతుల్లో పెట్టుకొని.

ఇక హిట్లరు సంగతి చెప్పనక్కరలేదు. అతని నివాసం జెర్కిటిస్ గాడెన్. సామాన్యుడు దానిలోనికి ప్రవేశించజాలడు. హిట్లర్‌ను ఎవరైనా హత్య చేయదలచుకున్నా గానీ అతని ఆప్త మిత్రులకు తప్ప అది మరొకరికి సాధ్యమయ్యే పనిగాదు. అతని ప్రైవేటు గదిలో టేబిల్ మీద ఒక స్విచ్ వుంటుంది. అనుమానం కల్గినప్పుడు దాన్ని నొక్కాడంటే ఆ రూము తప్ప తక్కిన గదులు అన్నీ ఒక రకమైన టియర్ గ్యాస్‌తో నిండిపోతాయి. ఇట్లాంటి ఎన్నో జాగ్రత్తలతో దిన దిన గండం నూరేళ్లాయుస్సుగా గడుపుతున్నాడు ఈ హిట్లర్ మహాశయుడు.

గ్రీసు నియంత జనరల్ మెటక్సాస్ ఇతని రక్షణ సన్నాహం భలే తమాషైనది. ఇతని కారు నిండా అద్దాలు బహు చమత్కృతితో అమర్చబడి వుంటాయట. ఈ అద్దాల అమరిక వల్ల కారులో ఆయన ఏ ప్రక్క కూర్చున్నదీ హంతకుడు గుర్తించలేడు. కూర్చున్నదొక ప్రక్కైతే మరో ప్రక్క వున్నట్లు విచిత్రంగా కనిపిస్తుంది చూచేవారికి.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

6-1-1961
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### ఏ.సి - అల్లూరి వివాదం

**అల్లూరి**

"సుబ్బారెడ్డిని చూచి జాలి పడుతున్నాను. ఆయన క్షతగాత్రుడు. నా ప్రసంగాలలోగానీ, ప్రకటనలలో గానీ, నేను యెప్పుడూ ఆయన పేరు ఎత్తలేదు. బాధ్యత గల కొన్ని పత్రికలలో నా మీద కొన్ని తీవ్రమైన ఆరోపణలు వచ్చినవి. సహజంగానే నేను వాటిని ఖండించాను. దానితో సుబ్బారెడ్డికి కోపం వచ్చి 1952 నుండి నా ఆస్తులను, నా కుటుంబ సభ్యుల ఆస్తులను వెల్లడించాలని సవాల్ జేశారు. ఆ సవాలును నేను స్వీకరిస్తున్నాను. నిష్పాక్షికమైన అధికారుల యెదుట మా ఆస్తి వివరాలు వుంచుటకు సిద్ధంగా వున్నాను. అయితే ఇదే కొలబద్ద సుబ్బారెడ్డి తనకూ వర్తింపజేసుకొనవలసి వుంటుంది. ఈ ఆరోపణలు రుజువు చేయలేని పక్షంలో రాగల పరిణామాలను యెదుర్కొనడానికి గూడా సుబ్బారెడ్డి సిద్ధంగా వుండాలె".

( గత 31వ తేదీ హైదరాబాదు పత్రికా విలేఖరులతో అల్లూరి)

**సుబ్బారెడ్డి**

"నన్ను గురించి అల్లూరి సత్యనారాయణ రాజు జాలిపడనవసరం లేదు. మంత్రి పదవిని పోగొట్టుకున్నందుకు నేను విచారించడం లేదు. అందువల్ల నేను క్షతగాత్రుణ్ణి కావడమనే ప్రశ్నేలేదు. కాంగ్రెస్‌లో చేరిన తర్వాత నేను 30 ఎకరాల మాగాణి భూమిని అమ్మివేశాను. నా తండ్రి నాకిచ్చిన ఆస్తిలో లక్షా ఇరవై వేలు కరిగి పోయింది. నా ఆస్తి వివరాలు వెల్లడించడానికి నేను సిద్ధంగా వున్నాను."

"అల్లూరి ఆస్తిని గూర్చి కొన్ని వదంతులున్నవి. అందువల్ల సందేహ నివారణ నిమిత్తం వారి ఆస్తిపాస్తుల తనిఖీకి అల్లూరి అంగీకరించవలెనని నేను సూచించాను.

(అల్లూరి ప్రకటనకు సమాధానంగా హైదరాబాదులో ఏ.సి.సుబ్బారెడ్డి యిచ్చిన జవాబు).

# నెల్లూరు ముచ్చట్లు
### విశేషాలు

## అకాలవర్షం

ఒకవైపు చలి, మరోవైపు మంచు చాలదంటూ నెల్లూరులో 4వ తేది మధ్యాహ్నం ఓ మోస్తరుగా వర్షం కురిసింది. ఉదయం నుంచి ముసురుపట్టి సూర్యుడు కూడా రాకపోవడంతో జనం ధనుర్మాసంలో ఇంతేకదా అనుకొన్నారు. అనుకోకుండా కురిసిన వర్షానికి ఖిన్నుల య్యారు. ఇళ్లలోని ముసలీముతక కలి కాలమంటూ నిట్టూర్చారు. మొత్తానికి ఈ విచిత్ర వాతావరణాన్ని తట్టుకోవడం నెల్లూరీయులకు కష్టంగానే వుంది.

## ఎస్పీకి పదోన్నతి

నెల్లూరు ఎస్పీ దామోదర్‌కు సీనియర్ సెలక్షన్ గ్రేడ్ ఎస్పీగా పదోన్నతినిస్తూ రాష్ట్ర ప్రభుత్వం 1వ తేది ఉత్తర్వులు జారీ చేసింది. మన ఎస్పీతో పాటు 1983 బ్యాచ్‌కు చెందిన మరో 15 మంది ఐపిఎస్ అధికారులకు సైతం ఈ పదోన్నతి లభించింది. ఈ పదోన్నతి మూలంగా వచ్చే యేడాదికి దామోదర్ డిఐజి అవుతారు.

## ఎన్నికల సంఘం ప్రధాన కార్యదర్శి

రాష్ట్ర ఎన్నికల సంఘం ప్రధాన కార్యదర్శి భన్వర్‌లాల్ 2వ తేది నెల్లూరు వచ్చారు. నెల్లూరు ఆర్డీఓ కార్యాలయ ప్రాంగణంలోని ఎలక్ట్రానిక్ ఓటింగ్ మిషన్లను భద్రపరచిన గోడౌన్‌ను తనిఖీ చేశారు. ఇక్కడ 1204 ఇవిఎంలను భద్రపరచినట్లు కలెక్టర్ రాంగోపాల్ భన్వర్ లాల్‌కు చెప్పారు. జిల్లాలో 18,85,072 మంది ఓటర్లకుగాను 18,76,208 మంది ఫోటో ఐడెంటి కార్డులు సమకూర్చిన జిల్లా అధికార యంత్రాంగాన్ని ఆయన అభినందించారు.

## తాళం వేసినా మీటరు రీడింగు

ఇళ్లకు తాళాలు వేసి వుండినా ట్రాన్స్‌కో విద్యుత్ మీటరు రీడింగు సేకరించను అడ్వాన్స్‌డ్ మీటరింగ్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్‌లో భాగంగా రేడియో ఫ్రీక్వెన్సీ టెక్నాలజీ విధానాన్ని ప్రవేశ పెడుతుంది. ఈ విధానంలో బిల్లుల లెక్కింపులో తప్పులు జరగవని, మీటర్ రీడింగ్ తీసే సమయం తగ్గుతుందంటున్నారు విద్యుత్ శాఖాధికారులు. నెల్లూరులోని కొన్ని డివిజన్‌లలో ఈ విధానాన్ని ప్రయోగాత్మకంగా అమలు చేస్తారు.

## మట్టి కుండల దర్గాలో గంధోత్సవం!

నెల్లూరు డైకస్‌రోడ్డులోని మట్టి కుండల దర్గాలో గంధోత్సవం జనవరి 1వ తేది ఘనంగా జరిగింది. పెద్ద సంఖ్యలో మహిళలు ఈ కార్యక్రమానికి హాజరయ్యారు. 2వ తేది ఉదయం భక్తుల కోరికలు తీర్చే మట్టి కుండలను పంచిపెట్టారు. కోరిన కోర్కెలు తీరిన భక్తులు వచ్చే యేడాది దర్గాలో మట్టి కుండల్లో ముడుపులు పెట్టి మ్రొక్కు తీర్చుకుంటారు.

## సిఐపై సిపిఐ కస్సు బుస్సు!

వివాదాలకు దూరంగా వుంటూ విధులు నిర్వహించే నగర సిఐ వీరాంజనేయరెడ్డిపై సిపిఐ పార్టీ నేతలు కన్నెర్ర చేశారు. ఆయనకు వ్యతిరేకంగా నగరంలో ప్రదర్శన చేయడంతోపాటు ఎస్పీకి ఆయనపై ఫిర్యాదు కూడా చేశారు. శాంతినగర్ ప్రాంతంలో సెల్వరాజ్ అనే వ్యక్తి హత్య జరిగింది. ఈ కేసు విషయమై సిపిఐ సానుభూతి పరుడ్ని సిఐ అదుపులోకి తీసుకొన్నారు. ఇతని ప్రవర్తన సరిలేక పోవడం వల్ల విచారించాల్సి వచ్చిందని సిఐ చెబుతుండగా రేపటి కార్పొరేషన్ ఎన్నికలలో తమ పార్టీ తరపున ఫత్తేఖాన్ పేట ప్రాంతం నుంచి పోటీ చేసేవాడిని స్టేషన్‌కు పిలిస్తే ఎలా అనేది సిపిఐ నాయకుల వాదన. నగరంలో సిపిఐని బలోపేతం చేయాలన్నఏకైక లక్ష్యంతో మార్కెట్ నాగేశ్వరరావు మొదలుకొని పలువురు అరాచక శక్తులను పార్టీ నాయకులను చేస్తున్నాడు పముజుల దశయ్య. రామకోటయ్య, గునపాటి రామచంద్రారెడ్డి వంటి నిస్వార్ధ నేతల మార్గనిర్దేశనలో నడిచిన పార్టీని దశయ్య గబ్బుపట్టించడం ఆ పార్టీ కార్యకర్తలను క్షోభిల్లేట్లు చేస్తుంది.

## ఎర్ర దర్గాలో గంధోత్సవం!

నెల్లూరు బారాషహీద్ దర్గా ప్రక్కన వుండే సయ్యద్ బాబా(ఎర్ర దర్గాలో) గంధోత్సవం 4వ తేది రాత్రి ఘనంగా జరిగింది. సయ్యద్ బాబా నెల్లూరీయులు. కోటమిట్ట, చేపల మార్కెట్ ప్రాంతంలో మౌన యోగిలా తిరిగేవారు. ఈయన మరణానంతరం నీటితో దీపం వెలగగా భక్తులు దర్గా ప్రాంగణంలో సమాధి చేశారు. బారాషహీద్లకు సయ్యద్ బాబా ఏకలవ్య శిష్యుడు.

## డికెడబ్ల్యు కాలేజిలో రగడ

నెల్లూరు డికెడబ్ల్యు కాలేజి ప్రిన్సిపాల్‌కు విద్యార్థులపై పట్టులేక పోవడంతో ఎప్పుడూ ఏదో ఒక గొడవ జరుగుతూనే వుంది. ఈ వారం కాలేజి హాస్టల్‌లో సెల్‌ఫోన్ ఛార్జింగ్ విషయమై ఇంటర్, డిగ్రీ విద్యార్థినుల మధ్య జరిగిన చిన్న గొడవ చివరికి చిలికి చిలికి గాలి వానగా మారి ఇరువర్గాలు రాళ్లతో పరస్పర దాడులకు దిగడంతో హాస్టల్‌లోని కిటికీల అద్దాలు పగిలిపోయాయి. సమాచారం అందుకొన్న నగర డిఎస్పీ రాధిక మొదట సర్దిచెప్పే యత్నం చేయగా ప్రయోజనం కానరాలేదు. దీంతో ఆమె కేసులు నమోదు చేస్తానని హుంకరించడంతో విద్యార్థినులు దారికి వచ్చారు.



రాష్ట్ర ప్రభుత్వ ప్రతిభా అవార్డు పొందిన తమ స్కూల్ విద్యార్థి షేక్ షారుక్‌ను అభినందిస్తున్న నెల్లూరు వేదాయపాళెంలోని లిల్లి లిటిల్ ఫ్లవర్ స్కూల్ కరస్పాండెంట్ ఇసి.నారాయణరెడ్డి.

## సహనమ్మ మరణం

మాజీ మునిసిపల్ కౌన్సిలర్, సీనియర్ అడ్వకేట్ వి.అనంతరామయ్య కుమార్తె శ్రీమతి చివుకుల సహనమ్మ 1తేది మరణించారు. హఠాత్తుగా తలెత్తిన ఆరోగ్య సమస్యలు ఆమె జీవితాన్ని అర్ధాంతరంగా ముగించాయి. నెల్లూరు టౌన్ రాజకీయాలలో ఒక వెలుగు దివ్వె వలె ప్రవేశించారామె. ఎంకాం చదివిన విద్యాధికత, తండ్రి నుంచి అబ్బిన సామాజిక స్పృహ, సహజంగానే సంక్రమించిన పోరాట స్ఫూర్తి ఆమెనొక ఆదర్శప్రాయ రాజకీయనేతగా పెంచుతాయని భావించారు అందరూ. కానీ మునిసిపల్ కౌన్సిలర్‌గా తనకెదురైన మురిగి రాజకీయాల పట్ల విసుగు చెంది, రాజకీయాలను వదలిపెట్టేశారామె. తెలుగుదేశం అధినేత చంద్రబాబు నాయుడు ఆమెకు విశ్వవిద్యాలయంలో సహాధ్యాయి. ఇద్దరి మధ్య మంచి స్నేహం వుంది. కానీ ఆమె మాత్రం జీవితకాలం కాంగ్రెస్ సభ్యురాలిగానే కొనసాగారు. ఆమె భర్త చివుకుల మాలకొండయ్య పేరున్న న్యాయవాది. గత సంవత్సరమే చిన్నవయస్సులోనే కన్ను మూశారాయన. ఇప్పుడు సహనమ్మ కూడా ఆయన్ను అనుసరించి వెళ్లిపోయింది. తన కళ్ల ముందు తన కన్న కూతురు కన్ను మూయడం చూసి తట్టుకోలేక దుఃఖంతో విలవిల లాడిపోతున్నారు అనంతరామయ్య గారు. వారి కుటుంబానికి మా ప్రగాఢ సానుభూతి.

## సిఐ వెంకటేశ్వర్లు మృతి

పోలీసు అంటే ఏమిటో సినిమాల తరహాలో నిరూపించిన మాజీ ఎస్పీ కె.శ్రీనివాసరెడ్డికి నమ్మిన బంటు, గిరిజన తెగనుంచి వచ్చినా వృత్తి నిర్వహణలో

కొరవ 14వ పేజీలో





## వాసిపల్లి రాఘవరెడ్డికి సంబంధించిన హెచ్చరిక నోటీసు

నా క్లయింట్లు **శ్రీ కాళికా ప్రసాద్‌రెడ్డి** (రిటైర్డ్ DSP), **లింగంపల్లి** మరియు **శ్రీ నెల్లూరు రమణారెడ్డి, లింగంపల్లి,** అనువారు **వాసిపల్లి రాఘవరెడ్డి (మడపల్లి)** ఫ్లాట్ 3-A, దేగా ఎన్‌క్లేవ్, మాగుంట లేఅవుట్, నెల్లూరు అనువారితో గల అన్ని రకముల లావాదేవీలు వదులుకోవడమైనది. సదరు **రాఘవరెడ్డి** నా క్లయింట్లు **శ్రీ కాళికా ప్రసాద్‌రెడ్డి, శ్రీ నెల్లూరు రమణారెడ్డి** పేర్లు చెప్పుకొని ఎవరితోనైనా ఎలాంటి లావాదేవీలు చేసినా, పై నా క్లయింట్లు ఆ లావాదేవీలకు బాధ్యులు కానేరరని, అవి చెల్లవని, ఇందు మూలముగా యావన్మందికి తెలియచేయడమైనది.

**పెనుబాక గంగాధరరెడ్డి**, బి.కామ్, బి.ఎల్.,
అడ్వకేటు, రమేష్‌రెడ్డి నగర్, నెల్లూరు. సెల్ 98493 49333

## వాసిపల్లి రాఘవరెడ్డికి సంబంధించిన హెచ్చరిక నోటీసు

నా క్లయింట్ **శ్రీ దేగా దయాకర్‌రెడ్డి,** చెన్నై అనువారు **వాసిపల్లి రాఘవరెడ్డి (మడపల్లి),** ఫ్లాట్ 3-A, దేగా ఎన్‌క్లేవ్, మాగుంట లేఅవుట్, నెల్లూరు అనువారితో గల **వ్యాపార, ఆర్థిక,** మరియు అన్ని రకముల లావాదేవీలు వదులుకోవడమైనది. సదరు **రాఘవరెడ్డి** నా క్లయింట్ **దేగా దయాకర్‌రెడ్డి** తరపునగానీ 'దేగా' ఫ్యామిలీ పేరు చెప్పుకొని గానీ ఎవరితోనైనా ఎలాంటి లావాదేవీలు చేసినా పైవారు ఆ లావాదేవీలకు బాధ్యులు కానేరరని, అవి చెల్లవని, ఇందుమూలముగా యావన్మందికి తెలియచేయడమైనది.

**పెనుబాక గంగాధరరెడ్డి**, బి.కామ్, బి.ఎల్.,
అడ్వకేటు, రమేష్‌రెడ్డి నగర్, నెల్లూరు. సెల్ 98493 49333

* దేవుడంటే భయంలేని దొంగలు

# మహాలక్ష్మమ్మనే పట్టుకెళ్లారు!



దోపిడీకి గురైన గుడి.

నెల్లూరు నగర నడిబొడ్డు అనదగ్గ చాకలివీధిలోని మహాలక్ష్మమ్మ గుడిలో 2010 చివరి రోజు రాత్రి జరిగిన దొంగతనం సంచలనం సృష్టించింది. విఆర్‌సి సెంటర్‌కు కూతవేటు దూరంలోని ఈ గుడి వద్ద నిత్యం జన సంచారముంటుంది. అటువంటి చోట వెండితో చేసిన అమ్మవారిని, బీరువాలోని ఆమె ఇరవై సవర్ల బంగారు నగలను పట్టుకపోవడం ఈ ప్రాంతీయులను విస్మపోయేలా చేసింది. మహలక్ష్మమ్మ గుడి చిన్నదైనా నిత్య పూజలు జరుగుతాయి. సాయంత్రం పూట భజన కూడా జరుగుతుంది. 60 ఏళ్లుగా ఈ గుడి ఇక్కడ వున్నట్లు స్థానికులు చెబుతున్నారు. దసరా ఉత్సవాలు ఇక్కడ ఘనంగా జరుగుతాయి. జనవరి 1వ తేదీ పెద్ద సంఖ్యలో భక్తులు సందర్శించే గుడిలో దొంగతనం జరగడంతో చాకలివీధిలోని మహిళలు కన్నీళ్లపర్యంతమయ్యారు. అమ్మవారి విగ్రహం మూడు కిలోల వెండితో చేసింది. వడ్డాణం, హారాలు, ముక్కుపుడకలు బంగారుతో చేసినవి. వేకువజామున మార్కెట్‌కు వెళ్లేవారు దోపిడీ జరిగిన విషయాన్ని వన్‌టౌన్ పోలీసులకు తెలియజేయడంతో దొంగతనాల కేసుల ఛేదింపులో అనుభవం కల్గిన వెంకట సుబ్బయ్యతోపాటు క్లూస్‌టీం వచ్చి వివరాలు సేకరించింది. ఇటీవలే రాయాజివీధిలోని ఆంజనేయస్వామి గుడిలో దొంగతనం జరిగింది. జిల్లాలోని దేవాలయాల్లో దోపిడీలైతే లెక్కలేవు. పోలీసులు ప్రతిష్టాత్మకంగా తీసుకొని దేవాలయాల్లో దొంగతనాలకు పాల్పడుతున్న వారిని పట్టుకోవాల్సిన బాధ్యత ఎంతైనా వుంది.

# సరికొత్తగా శుభాకాంక్షలు

## కనుమరుగౌతున్న గ్రీటింగ్ కార్డులు

Happy New Year



క్రొత్త సంవత్సరం వస్తోందంటే ఒకరికొకరు శుభాకాంక్షలు చెప్పుకొనేందుకు గ్రీటింగ్ కార్డులను వినియోగించేవారు. పలురకాల గ్రీటింగ్ కార్డులు ఆయా వ్యక్తుల అభిరుచులకు అనుగుణంగా మార్కెట్‌లో దొరుకుతుండేవి. సమాచార రంగంలో విప్లవాత్మక మార్పులు చోటుచేసుకోవడం, సెల్‌ఫోన్‌లు రావడంతో గ్రీటింగ్ కార్డుల వినియోగం తగ్గిపోయింది. చిన్న చిన్న మెసేజ్‌ల రూపంలో సెల్‌ఫోన్‌ల ద్వారా శుభాకాంక్షలు తెలియజేప్పే అవకాశం రావడంతో విడిగా గ్రీటింగ్ కార్డులను కొనుగోలు చేసేవారి సంఖ్య గణనీయంగా తగ్గిపోయింది. కార్డు కొనుగోలు చేయడంతోపాటు వాటికి అదనంగా పోస్టల్ స్టాంపులు వేయాల్సి రావడం వంటివి ఎస్ఎంఎస్‌ల వైపు మొగ్గుచూపేందుకు కారణమయ్యాయి. దీనికితోడు పూలబొకేల సాంప్రదాయం అధికమయ్యింది. ఉన్నతాధికారులు, రాజకీయ నేతలను దగ్గర్నుంచి కలసి తాము శుభాకాంక్షలు తెలిపేందుకు వివిధ రకాల పూలతో తయారయ్యే బొకేలను వినియోగించడం ఇటీవల కాలంలో పెరిగింది. చూసేందుకు ఎంతో ఆకర్షణీయంగా వుంటుండడంతో అధిక భాగం ప్రజలు బొకేలను కొనుగోలు చేస్తుండడంతో పూల మాలలక్కూడా కొంచెం డిమాండ్ తగ్గిందనే చెప్పాలి. మొత్తం మీద సమాచార రంగంలో, బయట జరుగుతున్న మార్పులు గ్రీటింగ్ కార్డులపై పెను ప్రభావాన్ని చూపాయనే చెప్పాలి.

# జబర్దస్త్‌గా జనవరి ఫస్ట్!

## నెల్లూరులోనూ బైక్ రేసులు



భగవంతుని దర్శనానికి తహతహ.

2011కు నెల్లూరీయులు ఘనంగా స్వాగతం పలికారు. 30వ తేది నుంచి నెల్లూరు నగరంలో ప్రస్ఫుటమైన మార్పు కనిపించింది. వ్యాపార సంస్థలు, కేకులు, బొకేలు, స్వీట్లు అమ్మే షాపులతోపాటు పండ్ల అంగళ్ల వద్ద జనాలు బారులు తీరారు. 31వ తేది ఉదయం నుంచి అర్ధరాత్రి దాటేంత తర్వాత కూడా నగరంలో పలుమార్లు ట్రాఫిక్ స్తంభించి పోయింది. సాయంత్రం ఆరు గంటల నుంచి రాత్రి పది గంటల వరకు పాదచారులు నడవడం కూడా కష్టమయ్యింది. ఎప్పుడూ లేనట్లు నెల్లూరు చిల్డ్రన్ పార్కు రోడ్డులో ఈసారి భాగ్యనగరం తరహాలో బైక్ రేసులు నిర్వహించారు. విషయం తెలుసు కొన్న నగర డిఎస్పీ రాధిక అక్కడికి వెళ్లి లాఠీ ఝుళిపించడంతో స్పీడ్‌గా వెళ్తున్న పలువురు యువకులు రోడ్డుపై పడిపోయారు. ఈ ప్రాంతంలోనే ఆటోలో వెళ్తుండిన యువతుల పట్ల అనుచితంగా వ్యవహరించిన యువకులకు సైతం ఆమె బడితపూజ చేశారు. నూతన సంవత్సరానికి స్వాగతం పలుకుతూ నగరంలోని అన్ని సెంటర్లలో బాణాసంచా కాల్చారు. కేరింతలు కొట్టారు. కేకులు, స్వీట్లు పంచుకొంటూ రచ్చ రచ్చ చేశారు. వీధుల్లో తిరుగుతూ ఇళ్లలో తలుపులు వేసుకొని వుండిన వారిని సైతం లేపి శుభాకాంక్షలు చెప్పారు. అపార్ట్‌మెంట్లలో ఈ వేడుకలు హుందాగా జరిగాయి. అర్ధరాత్రి ఒంటి గంట వరకు బ్రాందీషాపులు, బార్లు తెరచి వుండేలా ప్రభుత్వమే ప్రత్యేక ఉత్తర్వులివ్వడంతో మందు బాబులు పార్టీలతో రెచ్చిపోయారు. కలెక్టర్, ఎస్పీ బంగళాలతోపాటు నగరంలో వుండిన శాసన సభ్యుడు నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి, మాజీ ఎమ్మెల్యే జె.కె.రెడ్డి ఇళ్లకు పలువురు వెళ్లి శుభాకాంక్షలు చెప్పారు. చర్చీలు, దర్గాలలో జనసందడి కనిపించింది. శనివారం జనవరి 1వ తేది రావడంతో కొందరు హిందువులు మాంసాహారాన్ని వండలేదు. మొత్తం మీద అన్ని వర్గాల వారు జబర్దస్‌గా జనవరి వేడుకలు చేసుకొన్నారు.




బైకులతో యువకుల విన్యాసం.

# బతుకు బండి నడవడం భారమే!

## ఏం కొనేట్టు లేదు - ఏం తినేట్టు లేదు!




గడచిన మూడు మాసాలుగా నిత్యావసర వస్తువులతోపాటు బియ్యం, కూరగాయలు, పెట్రోల్, డీజిల్ రేట్లు విపరీతంగా పెరిగిపోతుండడంతో సామాన్య, మధ్య తరగతీయుల బతుకు బండి నడవడం కష్టమయ్యింది. ఆగష్టు, సెప్టెంబర్ నెలల్లో కాస్త తగ్గి వుండిన బియ్యం ధరలకు అక్టోబర్ నెలలో రెక్కలొచ్చాయి. నెల్లూరీయులు ఇష్టంగా తినే జిలకర మసూరి బియ్యం కిలో 30 రూపాయలకు ఏమాత్రం తగ్గలేదు. నిత్యావసర వస్తువుల్లో ముఖ్యమైనవిగా చెప్పుకోవాల్సిన సన్‌ఫ్లవర్ ఆయిల్, చింతపండు, ఎర్రగడ్డలు, తెల్లగడ్డలు, మిరపకాయల రేట్లు రెండింతలు పెరిగి పోయాయి. కందిపప్పు, మినపప్పు, పచ్చిశెనగపప్పు, పెసరపప్పు, చక్కెర రేట్లు మధ్య రకంగా వున్నా అవి హోల్‌సేల్ షాపుల్లోనే దొరుకుతున్నాయి. రిటైల్ షాపుల్లో రేట్లు దట్టించి అమ్ముతున్నారు. కూరగాయల రేట్లు గడచిన రెండు నెలల్లో నాలుగింతలు పెరిగాయి. కిలో ఐదు రూపాయలకు దొరికే టమోటాలు 40 రూపాయలయ్యాయి. వంకాయలు, బెండకాయలు ఇదే రేటు పలుకుతుండగా బీన్స్, క్యారట్, పందిరి చిక్కుడు వంటివి 60 రూపాయలు దాటేశాయి. మాంసాహారులు ప్రీతిగా తినే కోడిగుడ్డు రేటు రోజురోజుకు పైకి ఎగబ్రాకుతుంది. చికెన్ ధరలు పెరగకపోయినా మటన్ ఈ రెండు నెలల్లో కిలోకు 40 రూపాయలు పెరిగి పోయింది. డీజిల్, పెట్రోల్ ధరలు పెరగడం కూడా సామాన్య, మధ్యతరగతీయులను కోలుకోలేని దెబ్బ తీశాయి. నగరంలో పదివేల రూపాయలు సంపాదించేవారు కూడా పెరిగిన రేట్లతో కుటుంబాలు నడపడానికి నానాపాట్లు పడుతున్నారు. నిత్యావసరాలు, బియ్యం, కూరగాయల ధరలను జిల్లా ఉన్నతాధికారులు జోక్యం చేసుకుంటే కాస్త నియంత్రించవచ్చు. కానీ ఆ వైపుగా ప్రయత్నం లేకపోవడంతో జనానికి దేవుడే దిక్కుగా మారాడు.

# వివేకాకు చేదు అనుభవం!

## 21వ డివిజన్‌లో నిలదీసిన మహిళలు

నగరాన్ని కోట్ల రూపాయలతో అభివృద్ధి చేస్తున్నామని గొప్పలు చెప్పుకొనే రూరల్ శాసనసభ్యుడు ఆనం వివేకానందరెడ్డికి వివిధ ప్రాంతాల ప్రజల నుంచి చేదు అనుభవం ఎదురయ్యింది. స్థానిక 21, 22 డివిజన్‌లతోపాటు భక్తవత్సలనగర్ ప్రాంతంలో జనవరి 2వ తేది వివేకా తన అనుచరులైన మాజీ కార్పొరేటర్లతో కలిసి పర్యటించారు. సహజంగానే ఆయన కోట్ల రూపాయలతో నగరాన్ని సుందరంగా అభివృద్ధి పరచేందుకు నిధులు తీసుకువస్తున్నట్లు చెప్పబోయారు. ఈ సందర్భంగా ఆయన మాటలకు అడ్డు తగిలిన స్థానిక మహిళలు ఏంచేశావయ్యా మాకు, రోడ్లు దెబ్బతిని వున్నా పట్టించుకునే వారు లేరు. మంచినీళ్లు సక్రమంగా సరఫరా కావడం లేదు. ఒకవేళ వచ్చినా రంగు నీళ్లు వస్తున్నాయి. ఎన్నిసార్లు నాయకులను, అధికారులను కలసినా మాగోడు పట్టించుకొనే వారు లేరు. ఇప్పుడొచ్చి అభివృద్ధి అంటున్నావు అని నిలదీయడంతో పాపం వివేకా ముఖం మాడిపోయింది. వెంటనే తమాయించుకొన్న ఆయన తనను నిలదీసిన మహిళలతో వాదించలేక తనదైన ధోరణిలో ఓ సీన్ సృష్టించి అక్కడ నుంచి జారుకున్నాడు.

# ఇసుక రీచ్‌లు, సెజ్ భూముల్లో త్రవ్వినకొద్దీ అవినీతి!

**జిల్లాలోని ఇసుక రీచ్‌లలో ఆశ్చర్యపడే రీతిలో అవినీతి, అక్రమాలు చోటు చేసుకొంటే పరిశ్రమల స్థాపన పేరిట సెజ్‌లకు కేటాయించిన భూములలో పెద్ద దందానే నడుస్తున్నది.**




మేనకూరు టెక్స్‌టైల్ పార్కులో ఒక్క పరిశ్రమ కూడా ఏర్పాటు కాలేదు.

నెల్లూరుజిల్లాలో ఇసుక రీచ్‌లు, ఆర్థికమండళ్ల ఏర్పాటు కోసం కేటాయించిన భూముల్లో అధికారులు మాయాజాలం చేస్తున్నారు. లక్షలాది రూపాయలు చేతులు మారుతుండడంతో అధికారులు ఇష్టానుసారంగా వ్యవహరిస్తూ పోతున్నారు. ప్రశ్నించే వారు లేకపోవడంతో అధికారులు అధికార దుర్వినియోగానికి పాల్పడుతున్నారు. భూములు కోల్పోయిన రైతులు తగిన పరిహారం అందక ఆందోళన చెందుతుండగా, భూగర్భజలాలు అడుగంటి పోతాయని ఇసుక రీచ్‌లకు సమీపంలో నున్న గ్రామాల ప్రజలు భయాందోళనలు వ్యక్తం చేస్తున్నారు.




పెన్నానది గర్భాన్ని లోడేసి ఇసుకను టిప్పర్‌లకు ఎక్కిస్తున్న దృశ్యం.

## ఇసుక రీచ్‌లు

నెల్లూరు జిల్లాలో మొత్తం 15 ఇసుక రీచ్‌లు వున్నాయి. వీటిలో 10 రీచ్‌లకు వేలం పాటలు పూర్తి చేశారు. మిగిలిన అయిదు రీచ్‌లకు త్వరలో వేలంపాట నిర్వహించనున్నారు. గత సంవత్సరం 17 రీచ్‌ల వేలం పాటల నిర్వహణకు నోటిఫికేషన్ జారీ కాగా భూగర్భ జలశాఖ నుంచి అనుమతులు లేవని ముగ్గురు కాంట్రాక్టర్లు హైకోర్టును ఆశ్రయించి స్టే ఉత్తర్వులు తెచ్చారు. గత అక్టోబర్ నెలలో స్టే ఉత్తర్వులు రద్దయ్యాయి. భూగర్భజలశాఖ నుంచి అనుమతి లేనిదే ఇసుక రీచ్‌లకు వేలం పాటలు నిర్వహించరాదని హైకోర్టు స్పష్టం చేయడంతో అధికారులు గందరగోళానికి గురికావాల్సి వచ్చింది.

ఇసుకరీచ్‌ల వేలం పాటలకు సంబంధించి కాంట్రాక్టర్లు హైకోర్టును ఆశ్రయించగా దీనికి సంబంధించి కేవియట్ ఫిటిషన్ దాఖలు చేయడంలో భూగర్భ, గనులశాఖ అధికారులు విఫలం చెందారు. అధికారుల నిర్లక్ష్యం కారణంగా రీచ్‌ల వేలం పాటలు జరగక పోవడంతో కోట్ల రూపాయల ఆదాయం ప్రభుత్వం కోల్పోవాల్సి వచ్చింది. ఈ శాఖ అధికారులు అవినీతి, అక్రమాలకు పాల్పడుతున్నారన్న ఆరోపణలతోనే ప్రభుత్వం బదలీ చేసింది. దీనివల్ల ఎవరొచ్చినా రెండు, మూడు నెలల కంటే ఎక్కువ కాలం బాధ్యతలు నిర్వహించ లేకపోతున్నారు.

## జరిమానా వసూళ్లలో నాన్పుడు ధోరణి!

ఇసుక రీచ్‌లలో నిబంధనలకు భిన్నంగా త్రవ్వకాలు జరపడంపై విజిలెన్స్ ఎన్‌ఫోర్సుమెంట్ అధికారులు దాడులు చేసి సంబంధిత ఇసుకరీచ్‌ల కాంట్రాక్టర్ల నుంచి అపరాధ రుసుం వసూలు చేయాలని నివేదించడం జరిగింది. అయితే భూగర్భ గనులశాఖ అధికారులు సకాలంలో అపరాధ రుసుం వసూలు చేయలేకపోయారు. ఈలోగా జొన్నవాడ ఇసుకరీచ్‌దారుడు భాస్కర్ రావు రాష్ట్ర ప్రభుత్వానికి దరఖాస్తు చేసుకుని అపరాధ రుసుం చెల్లించకుండా ఉత్తర్వులు తెచ్చుకున్నాడు. ఒక్క కాంట్రాక్టర్‌కే ప్రభుత్వం అనుకూలంగా ఉత్తర్వులు జారీ చేయగా మిగిలిన ఇసుక రీచ్‌లదారుల నుంచి అపరాధ రుసుం వసూలు చేయడం మానేశారు అధికారులు.

విజిలెన్స్, ఎన్‌ఫోర్సుమెంటు అధికారులు అపరాధ రుసుం క్రింద దాదాపు 8కోట్ల రూపాయలు వసూలు చేయాలని నివేదించగా, సంబంధితశాఖ అధికారులు మాత్రం కేవలం 23 లక్షల రూపాయలు వసూలు చేసి చేతులు దులుపుకోవడంపై విమర్శలు వెల్లువెత్తాయి. అపరాధ రుసుం మొత్తం వసూలు చేసి వుంటే స్థానిక సంస్థలకు మరింత ఆదాయం సమకూరి అభివృద్ధి పనులు చేపట్టే అవకాశం దక్కేది. కోట్ల రూపాయల ఆదాయం చేజారి పోవడంతో అధికారుల తీరుపై స్థానిక సంస్థల ప్రతినిధులు మండిపడుతున్నారు. ప్రభుత్వ పరిధిలో, రాష్ట్ర హైకోర్టులో ఒక పిటిషన్ పెండింగ్‌లో వుంటే మొత్తం పిటిషన్ల గురించి పట్టించుకోవడం మానేస్తున్నారు.

వేలం పాటలకు సంబంధించి నోటిఫికేషన్ జారీ చేసే దగ్గర నుంచి అగ్రిమెంటు చేసే వరకు ఈశాఖ అధికారులు కాంట్రాక్టర్లు సిండికేట్‌గా ఏర్పడేందుకు పూర్తి సహాయ సహకారాలు అందిస్తున్నారు. తరచూ అధికారులు బదలీలపై వెళ్లడంతో కొత్తగా వచ్చే అధికారి గందరగోళానికి గురికావాల్సి వస్తుంది. గూడూరు డివిజన్‌లో వున్న క్వారీలో బ్లాస్టింగ్ జరిపేందుకు రాయల్టీ ఫీజు క్రింద భూగర్భ గనులశాఖకు కోటి రూపాయలు చెల్లించారు. ఈ ఫీజులో ఒక శాతం జిల్లా పరిషత్‌కు జమచేయాల్సి వుంటుంది. అయితే ఇప్పటివరకు ఇందుకు సంబంధించి ఒక్క రూపాయి కూడా జమ కాలేదు. ఇటీవల అసిస్టెంటు డైరెక్టర్‌గా వచ్చిన అధికారిని అడిగితే తనకు తెలియదని సమాధానం చెబుతున్నారని ఎమ్మెల్యేలే వ్యాఖ్యానిస్తున్నారు.

## సెజ్ భూములు

జిల్లాలో పరిశ్రమల స్థాపన కోసం అవసరమైన భూములను ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక మౌలిక సదుపాయాల కల్పనా సంస్థ సేకరిస్తుంది. రైతుల నుంచి తక్కువ ధరకు సేకరించి అధిక ధరలకు పరిశ్రమలకు విక్రయించడం ప్రస్తుతం ఈ సంస్థ అధికారులు చేసే పని. ఈ సంస్థ అధికారులు సేకరించిన భూములు, పరిశ్రమలకు అప్పగించిన భూములపై ఇటీవల జరిగిన జిల్లాపరిషత్ సర్వసభ్య సమావేశంలో పెద్దదుమారం రేగింది. సమావేశానికి హాజరైన జడ్పీటీసిలు, ఎమ్మెల్యేలు ప్రశ్నల వర్షం కురిపించారు. వీరి ప్రశ్నలకు సరైన సమాధానం చెప్పలేక ఎపిఐఐసి ప్రతినిధి తడబడ్డారు.

ముత్తుకూరు మండలంలో అసైన్‌మెంటు, సిజిఎఫ్‌ఎస్ భూములకు 40వేల రూపాయల వంతున చెల్లించి రైతుల నుంచి తీసుకొన్నారు. ఈ భూములనే ఎపిజెన్‌కో ఆధ్వర్యంలో చేపట్టే పవర్‌ప్రాజెక్టుకు ఎకరా 9లక్షల రూపాయల వంతున విక్రయం చేశారు. ఎపిఐఐసి ప్రభుత్వ సంస్థగా వుంటూ రైతుల భూములతో రియల్‌ఎస్టేట్ వ్యాపారం చేయడం ఎంతవరకు సమంజసమని ప్రజాప్రతినిధులు ప్రశ్నిస్తున్నారు. జిల్లాలో పవర్ ప్రాజెక్టుల ఏర్పాటుకు ప్రభుత్వం విచ్చలవిడిగా అనుమతులు ఇచ్చేస్తున్నది. మాగాణి భూములను సైతం పరిశ్రమల స్థాపనకు బలవంతంగా తీసుకుంటున్నారు. తీసుకుంటున్న భూములకు సరైన పరిహారం దక్కకుండా పోతుందని రైతులు వాపోతున్నారు.

జడ్పీ సమావేశంలో ఎమ్మెల్యేలు పరిశ్రమలకు ఎకరా ఎంత ధరకు విక్రయిస్తున్నారన్న ప్రశ్నకు వాస్తవం వెల్లడించక తప్పలేదు. రైతులకు ఎకరాకు 40వేలు చెల్లించి అదే భూమిని 9లక్షలకు విక్రయిస్తున్నారని, ఇక్కడ రైతులకు తీరని అన్యాయం జరుగుతుందని ఆగ్రహం వ్యక్తం చేశారు. జిల్లాలో మొత్తం 42 పరిశ్రమలకు 12వేల 829ఎకరాలు సేకరించడం జరిగింది. వీటిలో 22 పవర్ ప్రాజెక్టులు వున్నాయి. ఇప్పటి వరకు 14 పరిశ్రమలు మాత్రమే ఏర్పాటు చేయబడ్డాయి. మిగిలిన వాటిలో కొన్ని నిర్మాణ దశలో వుండగా మరికొన్నింటికి భూములు స్వాధీనం చేయాల్సి వుంది.

మొత్తం పరిశ్రమలకు 57వేల 556 కోట్ల రూపాయల పెట్టుబడులు పెడుతున్నారు. వీటిలో 49వేల 562 మందికి ఉద్యోగావకాశాలు కల్పిస్తామని పరిశ్రమల ప్రతినిధులు ప్రకటించి వుండగా ఇప్పటి వరకు 8వేల మందికి మాత్రమే ఉపాధి కల్పించడం జరిగింది. ఎపిఐఐసి ఆధ్వర్యంలో సేకరించిన భూములపై పూర్తిస్థాయిలో విచారణ జరిపించాలన్నది ప్రజాప్రతినిధుల డిమాండ్. జిల్లాలో ఇసుకరీచ్‌ల వేలం పాటలు, పరిశ్రమల ఏర్పాటుకు సేకరించిన భూములపై పలువురు ఎమ్మెల్యేలు వెల్లడించిన అభిప్రాయాలు దిగువనిస్తున్నాం.



### రియల్ ఎస్టేట్ వ్యాపారం



ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక మౌలిక సదుపాయాల కల్పనా సంస్థ రైతుల భూములతో రియల్ ఎస్టేట్ వ్యాపారం చేస్తుంది. భూములు కోల్పోతున్న రైతులకు సరైన పరిహారం అందించాల్సిన ఈ సంస్థ అధికారులు తీరని అన్యాయం చేస్తున్నారు. భూముల స్వాధీనం ద్వారా వచ్చిన నిధులను దేనికి ఖర్చు చేస్తున్నారన్న దానిపై విచారణ జరిపించాల్సిన అవసరం వుంది.

***బల్లి దుర్గాప్రసాద్,** గూడూరు ఎమ్మెల్యే*

### ఇసుక రీచ్‌లలో బోర్డులు పెట్టాలి



ఇసుక రీచ్‌లలో క్యూబిక్ మీటర్‌కు ఎంత వసూలు చేయాలన్న దానిపై భూగర్భ గనుల శాఖ అధికారులు బోర్డులు ఏర్పాటు చేయాలి. బోర్డులు ఏర్పాటు చేయకపోవడం వలన కాంట్రాక్టర్లు పెద్ద మొత్తాలను వసూలు చేస్తున్నారు. బోర్డులు ఏర్పాటు చేయడంతోపాటు నిబంధనలు ఉల్లంఘించిన ఇసుక రీచ్‌ల కాంట్రాక్టర్లపై కఠిన చర్యలు తీసుకోవాలి.

***శ్రీధరకృష్ణారెడ్డి,** నెల్లూరు నగర ఎమ్మెల్యే*



కృష్ణపట్నం పోర్టు యాజమాన్య నేతృత్వంలో మొక్కలు నాటే కార్యక్రమాన్ని ప్రారంభించి మాట్లాడుతున్న జిల్లా కలెక్టర్ రాంగోపాల్. వేదికపై నెల్లూరు ఆర్డీఓ వేణుగోపాల్‌రెడ్డి.


అట్రాసిటీ కేసుల దర్యాప్తు విషయమై తన ఛాంబర్‌లో అధికారులతో సమీక్ష జరుపుతున్న జిల్లా కలెక్టర్ రాంగోపాల్.


కళాశాల విద్యపై తన ఛాంబర్‌లో ఏర్పాటు చేసిన ప్రిన్సిపాల్స్, అధికారుల సమావేశంలో మాట్లాడుతున్న అదనపు జాయింట్ కలెక్టర్ సీతారామయ్య.



జనగణనపై జూబ్లీ హాల్‌లో ఏర్పాటు చేసిన సమావేశంలో మాట్లాడుతున్న డిఆర్వో జయరామయ్య.

# కోడూరులో కాంగ్రెస్ గెలిచింది

తోటపల్లి గూడూరు మండలం కోడూరు బిట్-1కు జరిగిన ఎమ్పీటిసి ఉప ఎన్నికలలో కాంగ్రెస్ విజయం సాధించింది. కాంగ్రెస్ అభ్యర్థిగా కావలి మల్లిఖార్జున, టిడిపి అభ్యర్థి కైలాసం రాజాపై 312 ఓట్ల మెజారిటీతో గెలుపొందాడు. ఎస్‌సి రిజర్వుడు స్థానమైన ఇక్కడ జరిగిన ఎన్నిక రాబోయే పంచాయితీ ఎన్నికల్లో ఆయా పార్టీల బలాబలాలను తేటతెల్లం చేసిందని పలువురు విశ్లేషిస్తున్నారు. స్థానిక సర్పంచ్‌గా వున్న తెలుగుదేశం

## ఎమ్పీటిసి ఎన్నికల ఫలితాలు

పార్టీకి చెందిన ఊటుకూరు శ్రీనివాసులు ఒంటరిపోరు చేయగా, కాంగ్రెస్ తరపున కావల్‌రెడ్డి రవీంద్రరెడ్డి, కోడూరు దిలీప్ రెడ్డి, దువ్వూరు సురేంద్రనాథ్‌రెడ్డి, చెన్నపల్లిపాళెంకు చెందిన దువ్వూరు శ్రీనివాసులరెడ్డి కలసికట్టుగా కాంగ్రెస్ విజయానికి కృషి చేశారు. కౌంటింగ్ సమయంలో తెలుగుదేశం పేచీపెట్టినప్పటికీ కాంగ్రెస్ అభ్యర్థి గెలిచాడు. రిటర్నింగ్ అధికారి పముజుల సుజాత, కృష్ణపట్నం సిఐ పోతురాజు ఓట్ల లెక్కింపును పర్యవేక్షించారు.

# పల్లెలకు జ్వరమొచ్చింది

● **వైద్య ఆరోగ్య శాఖాధికారులకు పట్టదా?**

జిల్లాలోని గ్రామీణ ప్రాంతాల్లో తిరిగి విషజ్వరాలు ప్రజలను వణికిస్తున్నాయి. దోమలు విజృంభించడం, వాతావరణంలో మార్పులు కారణంగా జ్వరాలు చుట్టుముడుతుండడంతో పలువురు అనారోగ్యానికి గురౌతున్నారు. విడవలూరు మండలంలో ఈ జ్వరాల తీవ్రత అధికంగా వుంది. ఒకే గ్రామంలో రెండు వందల మందికి పైగా రోగాలతో మంచమెక్కారు. వీరిలో నలుగురు మరణించడంతో ప్రజలు హడలిపోతున్నారు. గ్రామాలకు గ్రామాలు రోగాలతో అల్లాడిపోతున్నా వైద్యులు చికిత్స అందించడంలో తగిన శ్రద్ధ వహించక పోవడంతో ప్రజలు వైద్య చికిత్స అందక మంచం పట్టి వుండాల్సిన పరిస్థితి ఎదురౌతోంది. స్థోమత వున్నవాళ్లు ప్రైవేట్ వైద్యులను సంప్రదిస్తుండగా, పేదలు ప్రైవేట్ వైద్యుల వద్దకు వెళ్లలేక, ప్రభుత్వ వైద్యులు అందుబాటులో లేకపోవడంతో బిక్కుబిక్కుమంటూ కాలం వెళ్లదీస్తున్నారు. మండలంలో పారిశుద్ధ్యం లోపించడం, ఇళ్ల మధ్య నీరు నిల్వ వుండడం, చెత్త పేరుకపోయి వుండడం, దోమలు విజృంభిస్తుండడంతో గ్రామాల్లో రోజురోజుకు రోగగ్రస్తులు అధికం అవుతున్నారు. జ్వరాలకు తోడు కలుషిత నీటి వలన డయేరియా ప్రబలడంతో ప్రజలు అంటువ్యాధుల బారిన పడి అల్లాడిపోతున్నారు. ప్రభుత్వ ఆస్పత్రి వున్నా వైద్యులు, సిబ్బంది పత్తాలేకపోవడంతో చికిత్స అందించే వారు లేకుండాపోయారని గ్రామస్తులు వాపోతున్నారు.

# పిఆర్ క్లబ్ అధ్యక్షునిగా ఎల్లసిరి!

గూడూరులో పిఆర్ క్లబ్‌గా పేరొందిన పెల్లేటి రామిరెడ్డి క్లబ్ అధ్యక్షునిగా రాపూరు మాజీ శాసన సభ్యుడు ఎల్లసిరి శ్రీనివాసులరెడ్డి తిరిగి ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. జిడిరెడ్డి ఆధ్వర్యంలో జరిగిన ఈ ఎన్నికలలో ప్రధాన కార్యదర్శిగా దందు మస్తాన్‌రెడ్డి, కోశాధికారిగా పూడి లక్ష్మీనారాయణతోపాటు పదకొండు మంది కార్యవర్గ సభ్యులుగా ఎంపికయ్యారు. తెలుగుదేశం పార్టీలో వున్నప్పుడు ఒక వెలుగు వెలిగిన శీనయ్య కాంగ్రెస్ పార్టీలోకి మారి తన ప్రాభవాన్ని కోల్పోయాడని ఇలాంటి పదవులతో పరిపెట్టుకోవాల్సి వచ్చిందని ఆయన అభిమానులు వాపోతున్నారు.

# భూకబ్జాదారులకు రెవిన్యూ అండ

## వెంకటగిరిలో చోద్యమిది

వెంకటగిరి మండలంలో భూకబ్జాలు పెరిగిపోతున్నాయని, వీరికి రెవెన్యూ అధికారులు అండదండలందిస్తున్నారని వ్యవసాయ కార్మిక సంఘం ఆరోపించింది. వెంకటగిరిలో కార్మికసంఘం ఆధ్వర్యంలో రౌండ్ టేబుల్ సమావేశం జరిగింది. ఈ సందర్భంలో భూకబ్జాలపై ప్రసంగించారు. పరిశ్రమలు చుట్టుప్రక్కల ఏర్పాటవుతుండడంతో ప్రభుత్వ భూములను ఆక్రమించి లేఅవుట్లు వేసి విక్రయిస్తున్నా అధికారులు పట్టించుకోవడం లేదని విమర్శించారు. ఒక పథకం ప్రకారం జరుగుతున్న ఈ ఆక్రమణలకు పరోక్షంగా కొంతమంది రెవెన్యూ అధికారులు అండదండలున్నాయని ఆరోపించారు. భూకబ్జాదారులపై ఎలాంటి చర్యలు చేపట్టని అధికారులు పేదల పక్షాన భూమికోసం పోరాటం చేసే వారిపై మాత్రం కేసులు బనాయిస్తున్నారని దుయ్యబట్టారు. భూపంపిణీ బూటకం అని, అర్హులకు ఇది అందడం లేదన్నారు. వెంకటగిరి రెవెన్యూశాఖ పనితీరుపై ఒక భారీ కార్యక్రమాన్ని చేపడుతున్నట్లు వారు వివరించారు. ఈ సమావేశంలో వ్యవసాయ కార్మికసంఘం జిల్లా అధ్యక్షుడు బాలకృష్ణయ్య, బాలయ్య, శ్రీనివాసులు, మునెయ్య, రత్నం, ప్రభాకర్, సుధాకర్, కోటేశ్వరరావు తదితరులు పాల్గొన్నారు.

# బెల్టు షాపులపై అతివల పోరాటం!

## ఆదర్శనీయులు పొదలకూరు మహిళలు

మద్యం మహమ్మారిపై సమరశంఖం పూరించేందుకు మహిళలు నడుంబిగించారు. ముందుగా బెల్టుషాపులను తొలగించడంలో నారీమణులు తమ సత్తా చాటుతున్నారు. పొదలకూరు మండలంలో మహిళలు జిల్లాలోని ఇతర ప్రాంతాల వారికి ఆదర్శంగా నిలుస్తున్నారు. మద్యం రక్కసిని రూపుమాపేందుకు ప్రజల్లో చైతన్యం తీసుకవచ్చేందుకు మండలంలోని మహిళలు కలసికట్టుగా కృషి చేస్తున్నారు. మండలంలోని తోడేరు, అయ్యగారిపాళెం, చాటగొట్ల, పెద్దరాజుపాళెం, డ్యాంరోడ్డు, డేగపూడి, ఆదుర్తి, అంకుపల్లి తదితర ఎనిమిది గ్రామాల్లో వున్న బెల్టుషాపులను మహిళలు తొలగించారు. అధికారికంగా తొమ్మిది మద్యం షాపులున్నా వాటికి అనుబంధంగా వందకుపైగా బెల్టుషాపులు నడుస్తున్నాయి. వీటివలన పచ్చని కుటుంబాలు వీధిన పడుతున్నాయని మహిళలు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. ఇప్పటికి ఎనిమిది బెల్టుషాపులను తొలగించి పలువురికి మార్గదర్శకంగా నిలచిన మహిళల స్ఫూర్తితో మండలంలోని పలు ప్రాంతాల మహిళలు ఆయా గ్రామాల్లో గల బెల్టుషాపులను తొలగించేందుకు నడుం బిగిస్తున్నారు. మొత్తం మీద పొదలకూరు మండలంలోని మహిళలు జిల్లా మహిళలకు ఆదర్శంగా నిలువడం అభినందనీయం.

# కావలి గబ్బు వదిలిస్తాం!

**మునిసిపల్ రీజినల్ డైరక్టర్ కరుణ చంద్రబాబు**

కావలిలో పారిశుద్ధ్య పరిస్థితుల్ని మెరుగుపరచేందుకు ప్రత్యేకచర్యలు చేపడుతున్నట్లు పురపాలకశాఖ గుంటూరు రీజినల్ డైరెక్టర్ కరుణ చంద్రబాబు తెలిపారు. కావలి మునిసిపల్ కార్యాలయాన్ని సందర్శించిన ఆయన పలు అంశాలపై అధికారులతో సమీక్షించారు. పట్టణంలో పారిశుద్ధ్యం మెరుగుపరచే చర్యల్లో భాగంగా క్రొత్త వాహనాలను కొనుగోలు చేస్తున్నామన్నాడు. ప్రస్తుతం వున్న ఆరు ఆటోలకు తోడు మరో 12 ఆటోలను కొనుగోలు చేస్తున్నట్లు చెప్పారు. రిక్షాలను ఉపయోగించి ఇల్లిల్లూ తిరిగి చెత్తను సేకరించే కార్యక్రమాన్ని నూరు శాతం అమలు చేయనున్నట్లు తెలిపారు. చెత్తను రెండు భాగాలుగా చేసి తడి చెత్తను, పొడి చెత్తను వేరువేరుగా సేకరించేందుకు ముందుగా ఆరు వార్డులను పైలట్ ప్రాజెక్టు క్రింద ఎంపిక చేసినట్లు చెప్పారు. కంపోస్టుయార్డు కోసం కావలి రూరల్ మండలంలోని రుద్రకోటలో తొమ్మిది ఎకరాలను సేకరించామన్నారు. ప్రజలకు ఇబ్బంది కలుగని విధంగా వుండేందుకు రుద్రకోటలో ఈ యార్డును నెలకొల్పనున్నట్లు తెలిపారు. మునిసిపాలిటీ పరిధిలో అక్రమ లేఅవుట్లు అధికంగా వున్నాయని క్రమబద్ధీకరించుకోని వారిపై కఠిన చర్యలు తీసుకొంటామన్నారు.



నెల్లూరు కళ్యాణి ఫిలిమ్స్‌లో జరిగిన జనవరి 1 వేడుకలలో ఒంగోలు ఎమ్పీ మాగుంట శ్రీనివాసులురెడ్డికి కేక్ తినిపిస్తున్న జడ్పీ మాజీ ఛైర్మన్ చెంచలబాబు, రఘురాం, రాజ్‌కుమార్, శీనయ్య.

# రైతాంగానికి అందని పరిహారం

**సర్వేలతో సరి!**

ప్రకృతి వైపరీత్యాలు, అకాల వర్షాల వలన దెబ్బతింటున్న పంటలకు ఎలాంటి నష్టపరిహారం అందకపోవడం రైతులపై తీవ్ర ప్రభావాన్ని చూపుతోంది. అన్నదాతలను అన్ని విధాలా ఆదుకొంటామని ప్రభుత్వం పదేపదే చెప్తున్నా వాస్తవ పరిస్థితి మాత్రం అందుకు భిన్నంగా వుంది. తుఫాన్ లాంటి విపత్తులు సంభవించినపుడు రైతులకు నష్టం వాటిల్లినపుడు ఆదుకోవాల్సిన ప్రభుత్వం సర్వేలతో సరిపెడుతుండడంతో దిక్కుతోచని స్థితిలో రైతులు వుంటున్నారు. కంటితుడుపుగా సర్వేలు జరిపి నివేదికలు ప్రభుత్వానికి పంపి అధికారులు చేతులు దులుపుకొంటున్నారు. ఇటీవల మూడు తుఫాన్ల వల్ల నష్టపోయిన రైతులకు ఇంతవరకు ఎలాంటి పరిహారం లభించలేదు. బంగాళాఖాతంలో ఏర్పడిన వరుస వాయుగుండాల వల్ల పంటలకు తీవ్ర నష్టం వాటిల్లింది. అక్టోబర్ నుంచి ఇప్పటివరకు వచ్చిన మూడు తుఫాన్ల వల్ల వ్యవసాయ రంగం అతలాకుతలమైంది. అక్టోబర్ నెలలో కురిసిన వర్షాలకు 291 హెక్టార్లలో వరి, 1000 హెక్టార్లలో నారుమళ్లు దెబ్బతిన్నాయి. 35 ఎకరాల్లో అరటి, 25 హెక్టార్లలో ఆకుతోటలకు నష్టం వాటిల్లింది. మొత్తం మీద 1.34 కోట్ల మేర నష్టం జరిగింది. నవంబర్ నెలలో వచ్చిన జల్ తుఫానుకు 260 హెక్టార్లలో వరి నారుమళ్లు, 3470 హెక్టార్లలో వరిపంట, 378 హెక్టార్లలో మినుముపంటలకు నష్టం సంభవించింది. వీటితో పాటు ఉద్యానవన పంటలైన అరటి, ఆకు, కూరగాయల పంటలు తీవ్రంగా దెబ్బతిన్నాయి. జల్ తుఫాను వలన 4.95కోట్ల రూపాయల నష్టం జరిగినట్లు అధికారులు అంచనా వేశారు. ఇటీవల కురిసిన వర్షాలకు 5కోట్ల రూపాయల విలువైన పంట నష్టం జరిగినట్లు గుర్తించారు. ఈ మేరకు ప్రభుత్వానికి నివేదికలు పోతున్నాయి తప్ప పరిహారం మాత్రం రావడం లేదని రైతులు ఆవేదన చెందుతున్నారు.



నెల్లూరు ఇ-సేవా కేంద్రంలో అదనపు సేవలు ప్రారంభిస్తున్న జిల్లా పౌరసరఫరాల శాఖాధికారి జ్వాలా ప్రకాష్.

● తుమ్మలపెంటను

# పర్యాటక కేంద్రం చేసేదెప్పుడు?

కావలి రూరల్ మండలం తుమ్మలపెంటలో ఏర్పాటు చేయదలచిన పర్యాటక కేంద్రానికి అడుగడుగునా ఆటంకాలు ఎదురౌతూనే వున్నాయి. ఏడాది క్రితమే ఇక్కడ పర్యాటక కేంద్రాన్ని ఏర్పాటు చేసేందుకు ప్రభుత్వం నుంచి గ్రీన్ సిగ్నల్ వచ్చినా రాజకీయ కారణాలతో వీటికి అడ్డంకులు సృష్టించడంతో కేంద్రం ఏర్పాటు ఆలస్యం అవుతోంది. 8నెలల క్రిందట భూసేకరణ, రోడ్ల నిర్మాణం, భవన నిర్మాణం కోసం అనుమతులు మంజూరు చేసినట్లు ప్రకటించినా ఎక్కడా ఆ దిశగా పనులు చేపట్టిన దాఖలాలు లేవు. కనీసం టెండర్లు పిలువక పోవడంపై పలు అనుమానాలు వ్యక్తం అవుతున్నాయి. కొంతమంది కాంగ్రెస్ నేతలు దీనిని అడ్డుకొంటున్నారనే ప్రచారం జరుగుతుంది. దీనిపై స్థానిక శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు స్పందిస్తూ పలుమార్లు అధికారులను కలసినా ప్రయోజనం లేకుండా పోయిందని త్వరలో కేంద్రం ఏర్పాటుకు కృషి చేస్తానని వివరించారు.

**అడుగడుగునా ఆటంకాలు**

# అవినీతిబాటన బోగోలు ఉపాధి హామి!

ఉపాధిహామీ పనుల్లో అక్రమాలు, అవకతవకలు బయటపడుతూనే వున్నాయి. అధికారులు ఎన్ని తనిఖీలు చేసినా, పలువురిని విధుల నుంచి తొలగించినా సిబ్బంది అవినీతి దాహానికి అక్రమార్కులకు కల్పతరువుగా మారాయి. మండల పరిధిలోని కొండబిట్రగుంట, నాగులవరం పంచాయితి పరిధిలో ఉపాధిహామీ పథకం క్రింద 53లక్షల 80వేలు ఖర్చు చేశారు. ఈ నిధులతో మొత్తం 51 పనులను చేయగా అందులో 27 పనులు కాలువ పూడికతీత పనులు కావడం విశేషం. నాగులవరం పంచాయితీ పరిధిలోని రైతులకు ఏమాత్రం ఉపయోగపడని ప్రాంతంలో ఊటగుంట నిర్మాణం, చిన్న చిన్న కాలువలకు చేసిన పనులకు అధిక మొత్తంలో బిల్లులు చేసి జేబులు నింపుకొన్నారు. పదివేల రూపాయలతో పూర్తయ్యే పనులు కూడా లక్షల్లో అంచనాలు వేసి బినామీ మస్టర్లతో అధిక మొత్తంలో నిధులను స్వాహా చేసినట్లు పలు ఫిర్యాదులు రావడంతో అధికారులు విచారణ ప్రారంభించినట్లు ఎంపిడిఓ విజయేంద్రకుమార్ తెలిపారు. పూర్తిస్థాయిలో విచారణ జరిపి బాధ్యులపై చర్యలు చేపడుతామంటున్నారు.

**విచారణకు అధికారుల ఆదేశం**

# హనుమత్ యజ్ఞాలు!

తోటపల్లి గూడూరు మండలం వరిగొండ, వరకవిపూడి గ్రామాల్లో హిందూ ధర్మసమ్మేళనం ఆధ్వర్యంలో హనుమత్ మహాయజ్ఞం జరిగింది. అయోధ్యలో రామమందిరం నిర్మాణం చేపట్టాలని కోరుతూ ఆ సంస్థ ఆధ్వర్యంలో జిల్లా వ్యాప్తంగా యజ్ఞాలు నిర్వహిస్తున్నారు. దీనిలో భాగంగా వరిగొండ జ్వాలాముఖి ఆలయంలోనూ, వరకవిపూడి నరసింహస్వామి ఆలయంలోనూ వీటిని నిర్వహించారు. పెద్ద సంఖ్యలో భక్తులు పాల్గొన్న ఈ యజ్ఞంలో బిజెపి, ఆర్ఎస్ఎస్ నేతలైన బయ్యా వాసు, నాపూరు వెంకయ్య, కృష్ణారెడ్డి, సురేష్‌రెడ్డి, బ్రహ్మానంద తీర్థ, రాంమోహన్‌రెడ్డి, శ్రీధర్‌రెడ్డి, జయరాం, ఈదూరు నాగేశ్వరరావు, శ్రీనివాసులు తదితరులు పాల్గొన్నారు.

# చీడపీడల సీజన్ ఇది!

**దక్కిలి వ్యవసాయాధికారి వెల్లడి**

వరి సాగులో రసాయనిక ఎరువుల వాడకాన్ని తగ్గించేలా రైతులను చైతన్యపరచాలని దక్కిలి వ్యవసాయాధికారి నాగార్జున ఆదర్శ రైతులకు సూచించారు. స్థానిక మండల పరిషత్ కార్యాలయంలో జరిగిన ఆదర్శ రైతుల సమావేశానికి హాజరైన ఆయన పలు అంశాలపై సూచనలు అందించారు. రబీ సీజన్‌లో పంటల సాగుపై రైతులకు తగిన సలహాలను ఇవ్వడమేకాక పంటల సాగుపై అవగాహన కల్పించాల్సిన బాధ్యత ఆదర్శ రైతులపై వుందన్నారు. ఇటీవల కురిసిన వర్షాలతో మినుము పంటకు తెగుళ్లు ఆశించాయన్నారు. మినుములో మచ్చపురుగు, వరిలో కాండం కుళ్లు తెగుళ్లు అధికంగా పంటను నాశనం చేస్తున్నాయని, వీటి విషయంలో రైతులను అప్రమత్తం చేయాలన్నారు. ప్రభుత్వం సూచించే సలహాలు, పథకాల వివరాలను గ్రామాల్లోని రైతులకు ఎప్పటికప్పుడు తెలియజేస్పేందుకు బోర్డుల్ని ఏర్పాటు చేసి అందులో నమోదు చేయాలన్నారు. రైతాంగాన్ని చైతన్య పరిచే బాధ్యత ఆదర్శ రైతులపై వుందన్నారు. ఈ సమావేశంలో వ్యవసాయ విస్తరణ అధికారి వెంకటయ్య, ఆదర్శ రైతులు పలువురు పాల్గొన్నారు.

## ఖాకీ రాసలీలలు




విజయవాడ పోలీసు కమిషనర్ సీతారామాంజనేయులు రాసలీలలకు పాల్పడుతున్నట్లు 'రాసలీలల' టీవీ ఎబిఎన్ ఓ కార్యక్రమాన్ని ప్రసారం చేసింది. అయితే ముందుగా ప్రకటించినట్లు రామాంజనేయులు రాసలీలల్ని కథన రూపంలో చూపించకుండా ఇంటర్వ్యూతో సరి పెట్టింది. మొత్తానికి స్ట్రిక్ట్ ఆఫీసర్‌గా రికార్డు వున్న రామాంజనేయులు రాసలీలలకు పాల్పడటం పోలీస్‌శాఖలో హాట్‌టాపిక్‌గా మారింది. కమిషనర్ స్థాయిలో వున్న రామాంజనేయులు అమ్మాయిలకు ఎస్ఎమ్మెస్‌లు యిచ్చాడట. విజయవాడకు చెందిన తెలుగుదేశం నాయకుడు వంశీ ఈ గుట్టును రట్టు చేసినట్లు అభిజ్ఞ వర్గాల కథనం. అయితే వంశీకి, తనకు మధ్య వున్న విభేదాల కారణంగా తనపై ఈ ఆరోపణలు చేస్తున్నారని రామాంజనేయులు అంటున్నాడు. అయితే తనకు రామాంజనేయులు ఎస్ఎమ్మెస్‌లు ఇచ్చి వేధిస్తున్నాడంటూ ఓ డాక్టర్ కూడా ఫిర్యాదు చేయడం ఇక్కడ గమనార్హం.

## 'చిరు' తడబాటు

శ్రీకృష్ణకమిషన్ నివేదికను తెలియజేసేందుకు ఢిల్లీలో చిదంబరం ఏర్పాటు చేసిన అఖిలపక్ష సమావేశానికి ప్రతినిధుల్ని పంపే విషయంలో ప్రజారాజ్యం పార్టీ ఛీఫ్ చిరంజీవి తడబడ్డారు. ఈ సమావేశానికి ఇద్దరేసి వంతున ప్రతినిధుల్ని పంపాలన్న చిదంబరం కోరికను 'చిరు' ఆమోదించారు. ఆ మేరకు ప్రతినిధుల్ని కూడా నిర్ణయించారు. అయితే ఆ తర్వాత ఒక్కరు చాలు అంటూ మాట మార్చారు. ఎలాగూ ఒక్కరు సరిపోతారు కాబట్టి తానే ఆ సమావేశానికి హాజరు అవుతున్నట్లు చెప్పాడు. మళ్లీ మాటమార్చి సి.రామచంద్రయ్యను పంపాలన్న నిర్ణయానికొచ్చాడు. 'చిరు' తడబాటును చూసి పార్టీ నాయకులంతా ముక్కున వేలేసుకున్నారట. 'చిరు' అనుభవ రాహిత్యమంటూ సరిపెట్టుకుంటే పోలా!



## ఐఎఎస్‌ల బదలీలు ఆరు తర్వాతనే...!!



రాష్ట్రంలో ఐఎఎస్ అధికారుల బదిలీలు జనవరి ఆరో తేదీ తర్వాత జరుగనున్నాయి. కిరణ్‌కుమార్‌రెడ్డి ముఖ్యమంత్రి అయ్యాక భారీ ఎత్తున బదిలీలు చేయాలనుకొన్నా పరిస్థితులు కలిసి రాలేదు. ప్రస్తుతం జనగణన ఓటర్ల లిస్టు మదింపు కార్యక్రమం అమల్లో వుంది. ఆరోతేదితో ఇది పూర్తి అవుతుంది. అప్పటివరకు జిల్లా కలెక్టర్లు, ఇందుకు సంబంధించిన ఐఎఎస్‌లను బదిలీ చేయడం కుదరదు. అందుకే ఈ కార్యక్రమం పూర్తయ్యాక ఆరోతేది తర్వాత ఎప్పుడైనా భారీ స్థాయిలో ఐఎఎస్‌ల బదిలీలు జరుగుతాయి. ఇప్పటికే సిఎం బదిలీల జాబితాను సిద్ధం చేసుకున్నాడు. పరిస్థితులు అనుకూలిస్తే ఆరో తేది తర్వాత కిరణ్ మార్కు బదిలీల్ని చూడొచ్చు..!!

## ఇరకాటంలో హోం మంత్రి

రాష్ట్ర హోంశాఖమంత్రి సబితా ఇంద్రారెడ్డి చిక్కుల్లో పడ్డారు. మద్దెల చెర్వు సూరి హత్యకేసులోని నిందితులకు, హోంమంత్రి కుమారుడు కార్తీక్‌రెడ్డికి మధ్య అత్యంత సన్నిహిత సంబంధాలున్నట్లు పత్రికల్లో వార్తలు వచ్చాయి. నిందితులు హోంమంత్రి క్వార్టర్స్ కేంద్రంగా చేసుకొని పంచాయితీలు నడిపారట. నిందితుడు భాను గన్ లైసెన్స్‌కు కూడా హోం మంత్రి సిఫార్సు చేసినట్లు రాజధానిలో చెవులు కొరుక్కొంటున్నారు. దీంతో హోంమంత్రి ఆత్మ రక్షణలో పడ్డారు. తన కుమారుడికి క్లీన్‌చిట్ ఇప్పించుకునేందుకు పోలీస్ బాస్‌ను ఆశ్రయించినట్లు సమాచారం. దీంతో పోలీస్ బాస్ ఆ కార్యక్రమంలో నిమగ్నమయ్యారట. మంత్రి సిఫార్సుతోనే నిందితుడు లైసెన్స్ తీసుకున్న విషయం వాస్తవం కాదంటూ ఇప్పటికే పోలీస్ బాస్ స్టేట్‌మెంట్ ఇచ్చారు. చూద్దాం ఇకపై ఏం జరుగుతుందో!



## శ్రీ మహావిష్ణువుకు ప్రీతికరమైన మాసం ధనుర్మాసం!



ధనుర్మాసం ప్రారంభమైంది. వైష్ణవాలయాలలో గోదాదేవి పాశురాలను ఆలపిస్తుండడం, ఇళ్ల ముందు రంగవల్లులు దర్శనమివ్వడం ఈ మాసం ప్రత్యేకత. సంక్రాంతికి నెల రోజుల ముందు నుంచి ప్రారంభం అయ్యే ఈ మాసం విష్ణువుకు అత్యంత ప్రీతికరమైనది. సూర్య గమనాన్ని బట్టి, ఆయా మాసాలకు ఆ పేర్లు వచ్చాయి. సూర్యుడు ఏ రాశిలోకి ప్రవేశిస్తే ఆ రాశి పేరుతో సంక్రమణగా పిలుస్తారు. ధనూరాశిలోకి ప్రవేశించడాన్ని ధనుర్మాసంగా పిలుస్తారు. సూర్యుడు మకర రాశిలోకి ప్రవేశించి మకర సంక్రమణ జరిగే వరకు అనగా సంక్రాంతి వరకు వుండే రోజులను ధనుర్మాసంగా పిలుస్తారు.

ధనుర్మాసంలో విష్ణువ్రతం ఆచరించడం వలన కోర్కెలు తీరుతాయని ప్రతీతి. శ్రీవెల్లివత్తూరులో ఆళ్వార్ కుమార్తెగా పెరిగిన లక్ష్మీదేవి అవతారమైన ఆండాళ్ శ్రీకృష్ణభగవానుని పెళ్లాడదలచి ఈ వ్రతం ఆచరించినట్లు పురాణాలు చెప్తున్నాయి. ఆ నోము ఫలితంగా ఆండాళ్ శ్రీకృష్ణపరమాత్మను భర్తగా పొందగలిగింది. కాబట్టి ఈ మాసంలో విష్ణు వ్రతాన్ని ఆచరించడం వలన కోరిన కోర్కెలు తీరుతాయని నమ్మకం. ధనుర్మాసం యొక్క ప్రాశస్త్యాన్ని బ్రహ్మదేవుడు నారద మహర్షికి వివరించినట్లు బ్రహ్మాండ పురాణంలో పేర్కొనబడింది. జీవాత్మ పరమాత్మలో ఐక్యం చెందడమే లక్ష్యంగా గోదాదేవి రచన చేసిన పాశురాలను ఈ మాసంలో ఆలయాల్లో ఆలపించడం పరిపాటి.

ధనూరాశికి అధిపతి బృహస్పతి. జ్ఞాన బుద్ధిని వికసింపజేసేవాడు కాబట్టి ధనుర్మాసంలో వ్రతం చేయడం వలన బుద్ధి వికాసం పొందుతారని, జ్ఞానవంతులు, ఐశ్వర్యవంతులు అవుతారంటారు. ఈ మాసంలో విష్ణువును మధుసూధనుడిగా పిలుస్తారు. అందుకే ఈ వ్రతానికి మధుసూధన వ్రతం అని పేరుంది. ఈ వ్రతం ఆచరించే వారు బ్రహ్మీముహర్త కాలంలో మేల్కొని స్నానమాచరించి విష్ణు ప్రతిమను పంచామృతం, కొబ్బరినీరు, పాలు, సుగంధ ద్రవ్యాలతో అభిషేకిస్తారు. విష్ణువు అలంకార ప్రియుడు కాబట్టి వివిధ పుష్పాలతో అలంకరిస్తారు. తులసి దళాలన్నా విష్ణువుకు ప్రీతి. పసుపు పూలు, తులసి దళాలతో పూజిస్తారు. విష్ణునామస్మరణ చేస్తే పుణ్యం లభిస్తుందని ప్రతీతి. అలాగే ధనుర్మాసం రోజుల్లో పొద్దునే నగర సంకీర్తన చేస్తారు. ఇళ్ల ముందు రంగవల్లులతో అలంకరిస్తారు. వైష్ణవాలయాలలో ప్రత్యేక పూజలతోపాటు చక్కెర పొంగలి, దద్ధోజనం, పులిహోర ప్రసాదాలుగా అందిస్తారు. వీటన్నింటిలోనూ ఆయుర్వేదపరంగా ఆరోగ్య సూత్రాలు ఇమిడి వున్నాయి. సంకీర్తన వలన పొద్దునే స్వచ్ఛమైన గాలి పీల్చుకొనే అవకాశం లభిస్తుంది. పాటలు పాడడం వలన గొంతులోని నరాలు, పాదరక్షలు లేకుండా నడవడం వలన పాదాల నాడులు ఉత్తేజితం అయి రక్త ప్రసరణ సక్రమంగా జరుగుతుందట. హేమంత రుతువు రావడం వలన ఈ మాసంలో వాతావరణంలో మార్పులుంటాయి. వాత, పైత్య, కఫ, శ్లేష్మ దోషాలు, జ్వరాలు కల్గుతాయి కాబట్టి మిరియాలు, పెరుగు, పచ్చకర్పూరం తదితరాలతో తయారుచేసిన ప్రసాదాన్ని తినడం ఆరోగ్యానికి మంచిది. ఇక ఇంటి ముందు వేసే రంగవల్లుల్లో పసుపు, పిండి వాడడం వలన క్రిమికీటకాలు నశిస్తాయి. భక్తితోపాటు ఆరోగ్యపరంగాను ధనుర్మాసంలో అనేక అంశాలు ఇమిడి వున్నాయి.



మైపాడు వాస్తవ్యులు యరబోలు శ్రీనివాసులురెడ్డి కుమార్తె శ్రీవినీల డాక్టర్ వెంకట నరసింహారెడ్డిల వివాహం డిసెంబర్ **16**తేది నెల్లూరు టిటిడి కళ్యాణ మండపంలో జరిగింది.

## అర్ధరాత్రి పూజలను అడ్డుకొన్నారు



ఆగమశాస్త్ర నియమాలకు విరుద్ధంగా అర్ధరాత్రి దేవాలయాలను తెరచి పూజలు నిర్వహించడాన్ని నెల్లూరులో ఆర్‌ఎస్‌ఎస్, విహెచ్‌పి కార్యకర్తలు అడ్డుకొన్నారు. మామూలుగా కొత్త సంవత్సరం ప్రారంభం కాగానే అర్ధరాత్రి, అపరాత్రి అని చూడకుండా దేవాలయాలు తెరచి పెట్టడం, భక్తులు క్యూ కట్టడం మామూలే. టౌన్‌హాల్ వినాయకుడు, గాంధీనగర్ సాయిబాబా దేవాలయాల్లో అయితే అర్ధరాత్రి దర్శనాలకు అన్ని ఏర్పాట్లు చేశారు. భక్తులు బారులు తీరారు. అంతే ఆర్‌ఎస్‌ఎస్, విహెచ్‌పి కార్యకర్తలొచ్చి ఆలయ సిబ్బందిని అర్ధరాత్రి పూజలపై నిలదీసి దేవాలయాలను మూత వేయించారు. దీంతో భక్తుల్లో కూడా కాసింత ఆలోచన రేకెత్తింది. వారు తెల్లవారుఝాము దర్శనానికి వస్తామని వెనుతిరగడం కొసమెరపు.

## ఒక్కడితో అవినీతి అంతమా?



నెల్లూరు కార్పొరేషన్ వాటర్ వర్క్స్ విభాగంలో పని చేసే వుద్యోగుల్లో 90 శాతం మంది కోటికి పడగెత్తినవారే. దీనికి కారణం వీరిచ్చే దొంగ కొళాయి కనెక్షన్లు. డిమాండ్‌ను బట్టి ఒక్కో కనెక్షన్‌కు 5వేల నుంచి 20వేల రూపాయల వరకు వసూలు చేస్తారు. పది పైసలు కూడా మునిసిపల్ ఖజానాలో జమ చేయరు. వీరి పుణ్యాన నెల్లూరు నగరంలో 25వేల దొంగ కొళాయి కనెక్షన్లు వున్నాయంటే అతిశయోక్తి కాదు. వివిధ ప్రాంతాల్లో పని చేసే ఫిట్టర్ల చేతిలోనే నగరంలో నీటి నియంత్రణ వుందనేది వాస్తవం. ఇటువంటి పరిస్థితుల్లో ఫిట్టర్ సుధాకర్ దొంగ కొళాయి కనెక్షన్లు ఇస్తున్నాడంటూ ఈ వారంలో సస్పెండ్ చేశారు. ఫిట్టర్లు మొత్తం ఇదే బాటన నడుస్తుండగా ఒక్కడిపైనే చర్య ఏమిటనేది ట్రంకురోడ్డు టాక్.




## నిద్రపోని నెల్లూరు

వాస్తవంగా చెప్పుకోవాలంటే మతాలు, కులాలకు అతీతంగా నేడు జరుపుకొంటున్న ఏకైక పండుగ జనవరి 1. సంక్రాంతి, రంజాన్, క్రిస్మస్‌ల కంటే ఘనంగా ఏర్పాట్లు చేసుకొంటున్నారు. కేకులు, పండ్లు, పూలు, కొత్త బట్టలు తప్పనిసరయ్యాయి. మందు, విందు భోజనాలు, విషెస్‌లు మామూలే. 31తేది అర్ధరాత్రి అయితే అతివలు ఇళ్ల ముందు ముగ్గులేస్తూ తెల్లవార్లు గడిపిస్తే, యూత్ సెంటర్లలో సందడి చేస్తూ, బయటకు రాలేని వాళ్లు టీవీలలోని ప్రత్యేక కార్యక్రమాలు చూస్తూ శివరాత్రి జాగరణ చేశారు. మొత్తం మీద కొత్త సంవత్సరానికి స్వాగతం పలుకుతూ జనం నిద్రకు దూరమయ్యారు.

## ఫ్లాష్‌బ్యాక్‌లోకి రమ్మి!



మునిసిపల్ ఛైర్మన్, ఎమ్మెల్యే, రాష్ట్ర మంత్రిగా పనిచేసిన తాళ్లపాక రమేష్‌రెడ్డి ఎన్టీరామారావు వీరాభిమాని అన్న సంగతి అందరికీ ఎరుకే. ఆయన్ను ఈనాటికి ట్రంకురోడ్డులో ఆత్మీయులు 'రమ్మీ' అనే పిలుస్తారు. ఈ పిలుపు ఆయనకు చాలా ఇష్టం. ప్రతి ఏడాది డిసెంబర్ 31తేది మధ్యాహ్నం ఒక ప్రెస్ మీట్ పెట్టడం రమ్మీకి అలవాటు. ఈసారి పెట్టిన ప్రెస్‌మీట్‌లో ఆయన ఫ్లాష్‌బ్యాక్‌లోకి వెళ్లిపోయారు. నగరంలో ప్రప్రథమంగా సిమెంటు రోడ్లు నేనే వేయించాను. రాష్ట్రంలోని మునిసిపాలిటీలు దీన్ని ఫాలో అయ్యాయి. డ్రైనేజీలు ప్రతి వీధిలో కట్టించాను. ఎన్నో అభివృద్ధి పనులు చేసినా జనం నన్ను ఆదరించలేదే అని బాధపడ్డారాయన. రమేష్‌రెడ్డి ఫ్లాష్‌బ్యాక్‌కు కొత్త రిపోర్టర్లతోపాటు ఆయన అనుచరుల హృదయాలు బరువెక్కాయి.




ఉత్సాహం, సుఖసంతోషాలు అధికంగా అనుభూతిలోకి వస్తాయి. ఇంటికి కావలసిన వస్తువుల్ని చేర్చుకోవడంలో నిమగ్నులై ఉంటారు. ఉద్యోగ స్థానాల్లో మీ పలుకుబడి పెరిగి తృప్తినిస్తుంది. ఆకస్మిక పరిణామాలు ఏర్పడతాయి. కుటుంబసభ్యుల అభిప్రాయాలకు ప్రాముఖ్యమివ్వాలి. శ్రమతప్పదు. వారాంతంలో వృత్తిరీత్యా మీరు తీసుకొన్న నిర్ణయాల్లో హఠాత్పరిణామాలు చోటు చేసుకొంటాయి.




దైవపూజా కార్యక్రమాలతో మనశ్శాంతి లభిస్తుంది. చేతికం దిందంతా పూర్తిగా ఖర్చు చేస్తారు. ఇతరుల విషయాల్లో జోక్యం చేసుకొని ఇబ్బందులు కొని తెచ్చుకోవద్దు. కళత్ర సంబంధం కొంతవరకు మెరుగు. వ్యాపారాదులలో వచ్చిన నష్టాలను ఒక విధంగా పూడ్చుకొంటారు. బంధుమిత్రులు తమ వంతు సాయమందిస్తారు. అడ్డు తగిలి ఆగిపోయిన పనులు ఊపందుకొంటాయి.




ఆప్తమిత్రుల ద్వారా శుభవార్తాశ్రవణం. నియమ నిష్ఠలతో నమ్మకంతో పూజాదులు నిర్వహిస్తారు. వివాహది శుభకార్య చర్చలు చోటు చేసుకొంటాయి. దాంపత్యసుఖం అన్యోన్యత పెరుగుతుంది. విదేశపర్యటనలు హాయిగా సాగుతాయి. జాగ్రత్తగా, ఓర్పుతో సదాలోచనతో అడుగు వేయాలి. ఒకవైపు నిదానం మరొకవైపు ఉత్సాహం చోటు చేసుకొంటుంది. దొంగతనం జరుగవచ్చు.




మీ కార్యనిర్వహణా సామర్థ్యం బహిర్గతమవుతుంది. స్థిరాదాయానికి తగిన పథకాలు ఏర్పరుచుకొంటారు. రియల్ ఎస్టేట్ వ్యవహారాలు ఫలవంతమవుతాయి. కుటుంబంలో సుఖసంతోషాలు నెలకొంటాయి. ఎలాంటి సమస్యలనైనా ఉత్సాహంగా ఎదుర్కొంటారు. ఆధ్యాత్మిక గురువులను కలుసుకొంటారు. బాకీలు వసూలవుతాయి. నూతనోత్సాహంతో ధైర్యంతో పనుల్లోకి దూకుతారు.




ఇతరులకు మేలైన సాయాన్నందిస్తారు. మొదలు పెట్టిన పనుల్ని తుది అంట చేయడానికి స్నేహితులు చేయూతనిస్తారు. వృత్తిరీత్యా చక్కని ఫలితాలుంటాయి. ఆశ్చర్యపడేరీతిలో ప్రియవార్తాశ్రవణం చేస్తారు. చుట్టుపక్కలవారు సన్నిహితులు పొగిడేరీతిలో పనులు చేస్తారు. కుటుంబసభ్యుల నడుమ ప్రతిష్ఠ పెరుగుతుంది. ఖర్చులు ఊహించినంతకంటే అధికంగా ఉంటాయి.




నూతన వాహనప్రాప్తి లేదా వాహన రిపేర్ల అవకాశాలున్నాయి. వృత్తి అభివృద్ధికి తోడ్పడే వ్యక్తుల్ని కలుసుకొంటారు. ఉద్యోగరీత్యా ఎదురుచూసిన ఆర్థిక లాభాలు చేతికి అందివస్తాయి. చుట్టుపక్కల వారితో, బయట ప్రపంచంతో సత్సంబంధాలుంటాయి. ఇల్లు, ప్లాటు మొదలైనవి కొనే ప్రయత్నాలు ఊపందుకొంటాయి. రియల్ ఎస్టేట్ వ్యవహారాలు లాభకరంగా ముగుస్తాయి. ఆరోగ్యలోపం ఉండదు.

## వారఫలాలు

*తేది 8-1-2011 నుండి 14-1-2011 వరకు ధనుస్సులో రవి, బుధ, రాహువులు; వృశ్చికంలో శుక్రుడు; మకరంలో కుజుడు; మీనంలో గురువు; కన్యలో శని; మిథునంలో కేతువు; మకర, కుంభ, మీన, మేషాల్లో చంద్రుడు సంచరిస్తారు.*

### పంచాంగం

14తేది భోగి పండుగ.
15తేది సంక్రాంతి పండుగ.

**శుభ ముహూర్తాలు లేవు**

**జనవరి తిథులు**
**పుష్య శుద్ధ**

| | | | | |
|---|---|---|---|---|
| 8 | శని | చవితి | రా.8.20 | గం.ల.వ |
| 9 | ఆది | పంచమి | రా.10.46 | గం.ల.వ |
| 10 | సోమ | షష్ఠి | రా.1.20 | గం.ల.వ |
| 11 | మంగళ | సప్తమి | తె.3.50 | గం.ల.వ |
| 12 | బుధ | అష్టమి | తె.6.01 | గం.ల.వ |
| 13 | గురు | నవమి | పూర్తిగా | |
| 14 | శుక్ర | నవమి | ఉ.7.41 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com




సోదరులు అన్నివిధాల చేయూతనిస్తారు. నూతన ప్రయత్నాలలో అత్యధిక శ్రద్ధ చూపుతారు. పాత సమస్యలకు మంచిపరిష్కారం కనుగొంటారు. దగ్గరి ప్రయాణాలు లాభకరంగా ముగుస్తాయి. ప్రతి పని సులువుగా శ్రమలేకుండా చేసి ముగిస్తారు. రియల్ ఎస్టేట్ వ్యవహారాలు కోరుకొన్నరీతిలో జరుగుతాయి. సంతానమూలంగా సుఖశాంతులుంటాయి. వాహనాల ఖర్చులధికమవుతాయి.




ఆర్థికలావాదేవీలు సరియైన రీతిలో నిర్వహించి విజయం సాధిస్తారు. ఆగిపోయిన పనుల్ని మరల ఉత్సాహంతో పూర్తి చేస్తారు. కోరినవి కోరిన రీతిలో జరుపుకొంటారు. వృత్తి పురోభివృద్ధి విషయంలో అధిక శ్రద్ధ చూపుతారు. నూతన వ్యక్తులతో పరిచయం ఏర్పడుతుంది. వృత్తిరీత్యా కొత్తగా ఒప్పందాలు చేసుకొంటారు. ఉద్యోగులకు అధికారుల ఆదరణ ఉంటుంది.




ఎదురుచూసిన బదలీలు, మార్పులు చోటుచేసుకొంటాయి. నూతన వ్యక్తులతో మెలకువగా నడచుకోవాలి. దైవపూజలలో పాల్గొనాలి. అధికంగా ఖర్చు చేసినా తృప్తి ఉండకపోవచ్చు. దూరప్రయాణాలు నిరుపయోగాలు. వాయిదా పడ్డ పనులలో కొంత ముందంజ కానవస్తుంది. నూతన ప్రయత్నాలు చక్కని ఫలితాలనిస్తాయి. కుటుంబంలో ఆనందదాయకమైన సంఘటనలు చోటుచేసుకొంటాయి.




ప్రతిపనిలో నిదానం అవసరం. అప్పుడే మనశ్శాంతి లభిస్తుంది. మీ నిరీక్షణ ఫలించి ఎదురుచూసిన వ్యక్తితో సంభాషణ చేస్తారు. దూరప్రయాణాలు సత్ఫలితాలనిస్తాయి. ఆంత్ర బాధలుండవచ్చు. ధనవిషయంలో లోపముండదు. ఎదురుచూసిన రీతిలో ధనప్రాప్తి. ఆగిపోయిన పనుల్ని హుషారుగా పూర్తిచేస్తారు. ఉద్యోగులకు పదోన్నతి అవకాశాలు. సోదరులతో సత్సంబంధాలు నెలకొంటాయి.




ఇరుగుపొరుగు వారితో సంబంధాలు చక్కగా ఉంటాయి. దొంగచాటు శత్రువులు దూరమవుతారు. వైద్యసంబంధిత ఖర్చులు తప్పవు. పొదుపు చేసుకొన్న డబ్బు కరిగిపోయే సమయం. పథకం ప్రకారం చేయదలచిన పనుల్లో ఆటంకాలు. వృత్తిరీత్యా అభివృద్ధికిగాను తోటివారి తోడ్పాటు బాగా లభిస్తుంది. కళత్ర సంబంధీకుల నుండి మంచి పరిణామాలు ఎదురు చూడవచ్చు.




గృహాలంకరణలో ఆసక్తి చూపుతారు. వృత్తిలో పదోన్నతికి అవకాశాలు మెండు. వేతనోన్నతికి కూడ. వివాహ ప్రయత్నాలు చక్కగా ఫలిస్తాయి. ప్రయాణాలు సుఖాంతమవుతాయి. ధనాదాయ ప్రాప్తిలో ఆటంకాలు తొలగుతాయి. ఆత్మవిశ్వాసం పెరిగి పనులు ఆద్యంతం సులువుగా చేసుకుపోతారు. సోదరుల కుటుంబానికి సంబంధించి శుభవార్తాశ్రవణం ఉండవచ్చు. ఆధ్యాత్మిక చింతన అధికమవుతుంది.

# క్షేత్రార్పణము... విశ్లేషణ! ధిక్కార సంఖ్యల గణన!!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*పి.పుండరీకాక్షయ్య — నెల్లూరు*

* *క్షేత్రార్పణము అంటే ఏమిటి? ఈ వివరణ ఏ గ్రంథంలో వున్నది?*

గృహ నిర్మాణపు పొడవు, వెడల్పులను 8 సంఖ్యచే గణించి 9 సంఖ్యతో భాగిస్తే వచ్చే సంఖ్యలను బట్టి ఫలితాలు ఏర్పరచారు శాస్త్రజ్ఞులు. దీన్నే క్షేత్రార్పణం అంటారు. వీటిలో రాకూడనివి 1.తస్కర భయం, 6.నపుంసకత్వం, 8.దారిద్ర్యం, 9.భయ కారణం అను దోషాలను కలిగిస్తాయని 'వాస్తు రత్నాకరం' పేర్కొంటున్నది.

*వై.వి.అరుణ — సికింద్రాబాద్*

* *బాబు చదువులో బాగా వెనుకబడి పోతున్నాడు. అన్ని వివరాలు పంపిస్తున్నాను.*

వైఢూర్యం(శ్రేష్ఠ) కుడి చిటికెన వ్రేలికి ధరింపజేయండి. ఫలితం వుంటుంది.

*ఎం.మునికృష్ణయ్య — నెల్లూరు*

* *కార్యాలయ దోషాలు కూడా అధికారులపై పనిచేస్తాయా?*

కొత్త అధికారులు కార్యాలయాన్ని సరిచేసుకొని అందులో చేరడం మంచిది.

*టి.ఎన్.అనూరాధ — చెన్నై*

* *ఎప్పుడూ అనారోగ్యమంటారు. డాక్టర్లు ఏమీ లేదంటారు. ఏమిటి చేయడం?*

జాతకం, ప్లాను, ఇంటి ఫ్యోటో చూశాను. పశ్చిమ వాయువ్య దోషాలున్నాయి. శీతల యంత్ర ప్రతిష్ఠ చేయండి. అన్నీ సర్దుకొంటాయి.

*కె.జగదీశ్వరరావు — తిరుపతి*

* *అపార్టుమెంటు వీధి ఒకవైపు, గృహం ఒక వైపు వున్నాయి.*

వీధి దక్షిణం. తూర్పు, పశ్చిమ ప్లాట్లు నిర్మించారు. నిజానికి ఉత్తరం, దక్షిణ నిర్మాణాలు జరగాలి. దక్షిణం దుష్ఫలితాలే కాకుండా తూర్పు, పశ్చిమ దోష ఫలితాల్ని కూడా అనుభవించాల్సి వుంటుంది.

*ఎన్.ఆర్.వసుమతి — చిత్తూరు*

* *మీరు యంత్రం యిచ్చాక పరిస్థితులు చక్కబడ్డాయి.*

అంతా భగవంతుడి కృప. మంచి రోజులు రాబట్టి మీకు యంత్రప్రతిష్ఠ బుద్ధిని కలిగించాడు. యంత్రంలోని మంత్ర బీజాక్షరాలు అమోఘ ఫలితాల్నిస్తాయి. దైవానికి కృతజ్ఞతలు తెలియజేయండి.

*కె.అరుంధతినాయుడు — బెంగుళూరు*

* *వాస్తు జ్యోతిష్యాలు సరిచేసుకుంటే చాలా? అంతకు మించి శక్తులేవైనా వున్నాయా?*

వాస్తు జ్యోతిష్యాల్ని సరిచేసుకుంటే యాభై శాతం మార్గం సుగమమయినట్లే. మరో యాభై శాతం భగవంతుడిపై ఆధారపడి వుంది అంటారు మయబ్రహ్మ మయబ్రహ్మ వాస్తు సూత్ర చర్చలో.

*విరూరు లీలావతి — చెన్నై*

* *ఒక్కగానొక్క కుమారుడు దక్కడనుకున్నాము. 'నవగ్రహ సందర్శనం' గురించి, నవరత్నం గురించి మీరిచ్చిన సలహాలు బాగా పని చేశాయి.*

మీ విషయంలో నమ్మకమే ఎక్కువగా పని చేసింది. నమ్మకం దివ్యౌషధం.

*జి.సూర్యప్రకాశరావు — సికింద్రాబాద్*

* *మా నాన్నగారి పేరున వున్న ఇంట్లో నేనుంటున్నాను. అంతా బాగానే వుంది.*

పశ్చిమ నైరుతి వీధిపోటు మీ తండ్రిని కబళించింది. అన్నదమ్ముల రిజిస్ట్రేషన్ జరిగాక ఆ ప్రభావాలు మీపై చూపిస్తాయి.

*వై.వి.రమణారెడ్డి — నెల్లూరు*

* *స్థలం త్రికోణంలా వుంది. చాలా ధర తక్కువగా వస్తున్నది.*

నెల్లూరు మినీబైపాస్‌లో ఇలాంటి స్థలాలున్నాయి. అవి మృత్యుకుహరాలు. కోణాలు యజమాని ఆరోగ్యాన్ని హరించి క్రమేణా మృత్యుముఖంలోకి ప్రవేశ పెడతాయి.

*కేసినేపల్లి భానురాజు — కావలి*

* *సలక్షణమైన ఇంటికి 'స్వర్గధామం' ఇల్లు కావడానికి సలహా యివ్వండి.*

స్థలం, నిర్మాణ విషయాల్లోనూ, భూ, నిర్మాణ, వస్తు, వాస్తు విషయాల్లోనూ నమ్మకంతో వాస్తును పాటించండి. యంత్ర ప్రతిష్ఠ ఇంట్లో సుఖశాంతుల్ని కలుగజేస్తుంది.

# తుక్కు తుక్కయిన పంచాయితీరాజ్ రోడ్లు!

**గత ఏడాది వరుసగా వచ్చిన తుఫాన్లు, భారీ వర్షాల కారణంగా జిల్లాలో పంచాయితీరాజ్ శాఖకు సంబంధించిన పలురోడ్లు పూర్తిగా దెబ్బతిన్నాయి. రాకపోకలకు ఈ రోడ్లు ఏ మాత్రం అనువుగా లేకపోవడంతో గ్రామీణ ప్రాంత ప్రజలు నానా ఇబ్బందులు పడుతున్నారు.**



తోటపల్లిగూడూరులో తుక్కు తుక్కయిన పంచాయితీరాజ్ రోడ్డు.

జిల్లాలో అధ్వాన్నంగా వున్న పంచాయితీ రోడ్ల మరమ్మత్తులపై ఆ శాఖ దృష్టి సారించడం లేదు. వరుసగా వచ్చిన తుఫాన్లు, భారీ వర్షాల కారణంగా పంచాయితీరాజ్ శాఖకు సంబంధించిన పలు రోడ్లు పూర్తిగా దెబ్బతిన్నాయి. రాకపోకలకు రోడ్లు అనువుగా లేకపోవడంతో గ్రామీణ ప్రాంత ప్రజలు ఇబ్బంది పడుతున్నారు. నిధుల కొరత సాకుగాచూపి అధికారులు తప్పించుకొంటున్నారు. గ్రామీణ ప్రాంతాల్లోని రోడ్లన్నీ కూడా పంచాయితీరాజ్ శాఖ పరిధిలో వున్నాయి. నిధులున్నా కూడా రోడ్ల మరమ్మత్తుల కోసం ఖర్చు చేయడం లేదన్న విమర్శలు ఈ శాఖపై వున్నాయి.

గత ఎన్డీఏ ప్రభుత్వ హయాంలో ప్రధాన మంత్రి గ్రామసడక్ యోజన పథకం క్రింద గ్రామీణ ప్రాంతాల్లో తారు రోడ్ల నిర్మాణం చేపట్టడం జరిగింది. ఈ పథకం క్రింద రోడ్ల నిర్మాణం చేపట్టిన కాంట్రాక్టర్ ఐదు సంవత్సరాల వరకు నిర్వహణ చేయాల్సి వుంటుంది. కాంట్రాక్టర్‌కు చెల్లించాల్సిన బిల్లు మొత్తంలో ఐదు శాతం మినహాయించి మిగిలిన మొత్తం చెల్లించాలి. ఐదు సంవత్సరాల లోపల నిర్మించిన తారు రోడ్డు ఏదైనా మరమ్మత్తుకు గురికాడితే వెంటనే పనులు చేపట్టాల్సిన బాధ్యత కాంట్రాక్టర్‌పై వుంటుంది. అయితే కొన్ని ప్రాంతాలలో ఐదు సంవత్సరాల లోపే రోడ్డు మరమ్మత్తులకు గురైనప్పటికి సంబంధిత కాంట్రాక్టర్ పనులు చేయకుండానే వారికి రావాల్సిన బిల్లులను తీసుకున్నారు.

రోడ్ల దుస్థితికి చేరుకొన్నప్పటికీ పంచాయితీరాజ్ అధికారులతోపాటు, ప్రజాప్రతినిధులు పట్టించుకోవడం లేదన్న అభిప్రాయం ప్రజలలో వ్యక్తమవుతున్నది. గ్రామీణ ప్రాంతాల్లోని రహదారులతోపాటు తుఫాన్ పునరావాస కేంద్రాలు కూడా చాలావరకు దుస్థితికి చేరాయి. ఇటీవల కురిసిన భారీవర్షాల కారణంగా దెబ్బతిన్న రోడ్ల మరమ్మత్తుకు పంచాయితీరాజ్ అధికారులు దాదాపు 12 కోట్ల రూపాయలకు పైగా ప్రతిపాదనలు ప్రభుత్వ ఆమోదం కోసం పంపారు. మొత్తం 922 కిలోమీటర్ల మేర రహదారులు మరమ్మత్తులకు గురైనట్లు గుర్తించారు. "జల్" తుఫాను ప్రభావంతో 96 మెటల్, గ్రావెల్ రోడ్లు దాదాపు 260 కిలోమీటర్ల వరకు దెబ్బతిన్నాయి.

వీటికి నాలుగు కోట్ల రూపాయలు అవసరమవుతాయి. శాశ్వత మరమ్మత్తు పనులకు 60 కోట్ల వ్యయంతో ప్రభుత్వ ఆమోదం లభించింది. పంచాయితీరాజ్ శాఖ ఆధీనంలో 5,640.25 కిలోమీటర్ల మేర రహదారులు వున్నాయి. వీటిలో సిమెంటు రోడ్లు 376.29 కిలోమీటర్లు, మెటల్ రోడ్లు 735.35 కిలోమీటర్లు, గ్రావెల్ రోడ్లు 3,313.16 కిలోమీటర్లు వున్నాయి. రోడ్లు వేస్తున్న కాంట్రాక్టర్లతో ఇంజనీర్లు కుమ్మక్కై అవినీతి, అక్రమాలకు పాల్పడుతున్నారన్న ఆరోపణలు బలంగా వినిపిస్తున్నాయి. ప్రధానమంత్రి గ్రామసడక్ యోజన పథకం క్రింద చేపట్టిన తారు రోడ్ల నిర్మాణ పనుల్లో నాణ్యతా ప్రమాణాలు లోపిస్తున్నాయి.

పనులు చేసిన కాంట్రాక్టర్లతోపాటు నిత్యం తనిఖీలు చేయాల్సిన ఇంజనీర్లపై ఇప్పటివరకు ఎటువంటి చర్యలు చేపట్టిన దాఖలాల్లేవు. కోట్ల రూపాయల నిధులు కేంద్ర ప్రభుత్వం విడుదల చేస్తున్నా గ్రామీణ ప్రాంతాల్లోని రహదారులు మాత్రం మెరుగుపడడం లేదు. ఇప్పటికైనా ప్రజాప్రతినిధులు స్పందించి రహదారుల నిర్మాణాల నాణ్యతపై దృష్టి సారించాల్సిన అవసరం వుంది.

జలయజ్ఞం

# జిల్లాలో నత్తనడకన జలయజ్ఞం పనులు!

జిల్లాలో జలయజ్ఞం పేరుతో చేపట్టిన సాగునీటి ప్రాజెక్టు పనులు సంవత్సరాలు గడిచిపోతున్నా పూర్తికావడం లేదు. వందల కోట్ల రూపాయలు జలయజ్ఞం కోసం ఖర్చు చేస్తున్నప్పటికీ అధికారుల నిర్లక్ష్యం, ప్రజాప్రతినిధుల వుదాసీనత కారణంగా పనులు దక్కించుకున్న కాంట్రాక్టర్లు పనులు పూర్తి చేయడం లేదు. 2007 సంవత్సరం నుంచి జిల్లాలో జలయజ్ఞం పనులకు శ్రీకారం చుట్టింది రాష్ట్రప్రభుత్వం. ఈ పథకం క్రింద నిర్దేశించిన పనులకు నిధులు కేటాయింపు జరిగినా ఆ తర్వాత విడుదల చేయడంలో కొంత జాప్యం ఏర్పడింది.

సాగునీటి ప్రాజెక్టు పనులు సకాలంలో పూర్తి కాకపోవడంతో ఆయకట్టు రైతులు ఇబ్బందులు పడాల్సి వస్తుంది. సాగునీటి ప్రాజెక్టు పనులను పర్యవేక్షించాల్సిన నీటి పారుదలశాఖ ఇంజినీర్లు సరైన పర్యవేక్షణ చేయకపోవడంతో కాంట్రాక్టర్లు కూడా కాలయాపన చేస్తూ వస్తున్నారు. జిల్లాలో చేపట్టిన జలయజ్ఞం ప్రాజెక్టుల్లో వాకాడు బ్యారేజి నిర్మాణం మాత్రం పూర్తి చేయగలిగారు. మిగిలిన ప్రాజెక్టులు నేటికీ ప్రారంభదశలోనే వున్నాయి. సంగం బ్యారేజి నిర్మాణం, నెల్లూరు బ్యారేజి నిర్మాణం, పెన్నాడెల్టా ఆధునీకరణ పనులు, కనుపూరు కాల్వ ఆధునీకరణ, డిస్ట్రిబ్యూటరీ సిస్టం ఆధునీకరణ, గండిపాళెం ప్రాజెక్టు ఆధునీకరణ ఇతర మైనర్ ఇరిగేషన్ పనులు జరుగుతున్నాయి.

జిల్లాలో దాదాపు రూ.700 కోట్లకు పైగా జలయజ్ఞం ప్రాజెక్టు పనులు జరుగుతున్నా నిర్ణయించిన కాలవ్యవధిలో ఒక్కటి కూడా పూర్తి చేయలేకపోతున్నారు.

**జలయజ్ఞం కార్యక్రమంలో భాగంగా జిల్లాలో చేపట్టిన నీటి ప్రాజెక్టుల్లో వాకాడు బ్యారేజ మాత్రం నిర్మాణం పూర్తయ్యింది. మిగిలిన ప్రాజెక్టులన్నీ ప్రారంభదశలోనే వున్నాయి.**

ప్రతి సంవత్సరం కాలవ్యవధిని పొడిగించుకుంటున్నారే తప్ప సకాలంలో పూర్తి చేయించేందుకు మాత్రం సంబంధిత శాఖాధికారులు చర్యలు చేపట్టలేకపోతున్నారు. పెద్ద ప్రాజెక్టులుగా వున్న సంగం బ్యారేజి, నెల్లూరు బ్యారేజి నిర్మాణ పనులు నిలిచిపోయాయి. సంగం బ్యారేజికి 122.50 కోట్లు కేటాయించగా, ఇందులో 11 కోట్ల రూపాయల పనులు మాత్రమే చేయగలిగారు. అలాగే నెల్లూరు బ్యారేజీ నిర్మాణానికి 126.76 కోట్లు కేటాయించగా 30 కోట్ల రూపాయల పనులు చేసి కాంట్రాక్టర్ పత్తా లేకుండా పోయాడు.

పెన్నాడెల్టా ఆధునీకరణ పనులు పూర్తి చేసేందుకు 2013వ సంవత్సరం వరకు గడువునిచ్చారు. ఒక కంపెనీకి రెండు, మూడు ప్యాకేజి పనులు అప్పగించడంతో ఒకటి కూడా పూర్తి కావడం లేదు. కనిగిరి రిజర్వాయర్ ప్రధాన కాల్వ పూడికతీత, దగదర్తి, అల్లూరు చెరువుల కాల్వల లైనింగ్ పనులు చేపట్టే పనులను ప్రాజెక్టు ఇండియా లిమిటెడ్ కంపెనీకి అప్పగించారు. దీంతోపాటు జాఫర్‌సాహెబ్ కాల్వ, గంగపట్నం, వరిగొండ కాల్వలకు లైనింగ్ చేసే పనులను కూడా ఇదే కంపెనీ దక్కించుకుంది. పై రెండు ప్యాకేజీలకు 80కోట్ల 70లక్షల రూపాయలు కేటాయిస్తే డిసెంబర్ నెలవరకు కేవలం 7కోట్ల రూపాయల పనులు మాత్రమే పూర్తి చేశారు.

ఎపిఆర్ కన్‌స్ట్రక్షన్ ప్రైవేట్ లిమిటెట్ కంపెనీ మూడు ప్యాకేజీల సాగునీటి ప్రాజెక్టు పనులు దక్కించుకుంది. 352 కోట్ల రూపాయల పనులకు గాను 54 కోట్ల రూపాయల పనులు చేపట్టారు. పెన్నా బ్యారేజి నిర్మాణ పనులు దక్కించుకున్న ఎకెఆర్, కోస్టల్ (జె.వి) కంపెనీకి 72 కోట్ల వ్యయంతో చేపట్టే కనుపూరు కాల్వల ఆధునీకరణ పనులు కూడా అప్పగించారు. ఇక్కడ పనులు ప్రారంభించి రెండు సంవత్సరాలు పూర్తయ్యాయి. 72కోట్లకుగాను 13 కోట్ల రూపాయల పనులు చేయడం జరిగింది.

చిన్న నీటిపారుదల కాల్వల పనులు కూడా పూర్తికాకపోవడంతో సాగునీరందక వరినాట్లు ఎండిపోయే ప్రమాదం ఏర్పడింది. ఇటీవల రెండవపంట వేయని ప్రాంతాల్లో కాల్వల ఆధునీకరణ పనులు పూర్తి చేయాలని సాగునీటి సలహా సంఘం సమావేశంలో తీర్మానించినప్పటికి లైనింగ్ పనులు పూర్తి కాలేదు. పనులు పూర్తవుతాయని భావించిన ఆయకట్టు దారులకు చివరకు నిరాశే మిగిలింది.

# బొక్క బోర్లా పడ్డ రంగ ది దొంగ!



అల్లూరు రహీం

తెక్కకు మించి తెలుగు సినిమాల్లో విలన్‌గా కనిపించిన జీవి అనబడే సుధాకర్ నాయుడు దర్శకుడుగా మారి తీసిన చిత్రమే రంగ ది దొంగ. తెలుగు తెరపై తెగనలిగిన ఫ్యాక్షన్ ఇతివృత్తాన్ని బ్యాక్‌డ్రాప్‌గా తీసుకొని ఈ చిత్రాన్ని తీశాడు. సినిమా మరీ సీరియస్‌గా కనపడకూడదని ప్రధమార్థంలో శ్రీకాంత్‌ను దొంగగా ద్వితీయార్థంలో ఫ్యాక్షన్ నాయకునిగా చూపించాడు. ఫ్యాక్షనిస్టుల దగ్గర పనిచేసే అనుచరుల జీవితాలు ఎంత దుర్భరంగా వుంటాయన్న ఒక్క కోణం తప్ప ఈ చిత్రంలో చెప్పుకోతగ్గ కొత్తదనమేదీ లేదు. 16 రీళ్ల స్క్రీన్‌ప్లేలో లెక్కలేనన్ని బూతుమాటలు, రెండు ఐటమ్ పాటలు, హీరోయిన్ పొట్టి దుస్తుల ధరింపుతోనే నడుస్తుంది. రంగ ది దొంగ కథలో పసలేకపోవడం వల్ల దర్శకుడు జీవి, రమ్యకృష్ణ, శ్రీకాంత్‌లు తమ పాత్ర పోషణలో కష్టపడినా ఫలితం లేకుండా పోయింది. ఈ సినిమాలో గొప్పతనం ఏదైనా వుందంటే అది పరభాషా నటీనటులు లేక పోవడం. 20 మంది కొత్త నటులకు ఈ చిత్రం ద్వారా అవకాశమివ్వడం. వీరిలో పులిచెర్ల ఫ్యాక్షన్ లీడర్‌గా నటించిన వెటరన్ నటుడు అదరగొట్టేశాడు. తెలుగు తెరకు మంచి విలన్ దొరికాడు. అయితే ఈ చిత్రంలో దొంగలకు చిట్కాలు చెప్పే సన్నివేశంగా ఎసి మిషన్ పైపు నుంచి క్లోరోఫాంను పంపే ఆలోచన దారుణం. మాటలు కూడా వ్రాసిన జీవి పెన్‌కు ముందే గన్ అంటాడు. యుకెజి పిల్లలు పలకలకంటే ముందే పెన్‌ను పడతారా? ఆయనే వ్రాసిన దొబ్బితాగి సంసారం... దొంగతనం చేయకూడదు. సీమలో చీమకు మీసం, సీమలో తాగడానికి నీళ్లే కాదు... కార్చడానికి కన్నీళ్లు లేవు. ఆయన స్థాయిలోనే వున్నాయి. చక్రి సంగీతం కూర్చిన పాటలు వినసొంపుగా లేవు. నా ఒళ్లే బెల్లం పట్టీ ఐటమ్‌సాంగ్‌లో టివీల్లో విలన్ భువనేశ్వరి, తస్లీమాలు దేహప్రదర్శనలో పోటీపడ్డారు. వలే వలే మీనాక్షి పాటలో పాత హీరోయిన్ సాక్షి శివానంద్ ఐటమ్‌గర్ల్‌లా మారిపోయింది. ఎత్తుగా వుండే హీరోయిన్ విమలారామన్ వేసిన కురచ దుస్తులు గలీజుగా కనిపించాయి. చిత్ర నిర్మాత సి.ఆర్.మనోహర్ కూడా మంచి నటుడేనని ఆయన పోషించిన ఫ్యాక్షన్ లీడర్ పాత్ర చాటింది.




చిత్ర కథలోనికివెళ్తే రంగ(శ్రీకాంత్) దొంగతనమే వృత్తిగా హైదరాబాద్‌లోని స్టూవర్ట్ నగర్‌లో నివశిస్తుంటాడు. విచిత్రమేమిటంటే పోలీసుల ఇళ్లలోనే దొంగతనాలు చేస్తూ వారికి సవాల్ విసురుతుంటాడు. అతన్ని ముసలి(తెలంగాణ శకుంతల) పెంచి పోషిస్తుంది. రాయలసీమ ఫ్యాక్షన్ సినిమాల్లో విలన్ జయన్న(జయప్రకాష్ రెడ్డి) అంటే రంగకు ఎంతో అభిమానం. అమలాపురం నుంచి హైదరాబాద్‌లోని మహిళా పోలీస్‌స్టేషన్‌కు ఎస్‌ఐగా వచ్చే మంగ(విమలారామన్) తొలి చూపులోనే రంగను ప్రేమించేస్తుంది. తోటి పోలీసులు అతను దొంగన్నా కృష్ణుడు లాంటి దొంగ... మొగుడుగా వస్తాడంటూ చిన్నప్పుడే చిలక జోస్యం చెప్పారని సమర్ధించుకొంటుంది. పోలీస్ కమిషనర్(నాగబాబు) ఇంట్లో దొంగతనం చేస్తూ రంగ పట్టుబడిపోతాడు. కోర్టుకు తరలించిన సమయంలో ఈ ప్రాంగణంలో రాయలసీమలోని సింహపురి ప్రాంత ఫ్యాక్షన్ లీడర్ భవానీ ప్రసాద్‌ను అతని వ్యతిరేకులైన పులిచర్ల ఫ్యాక్షన్ లీడర్లు అంతమొందిస్తారు. భవానీప్రసాద్‌లా వుండే రంగను చూసిన రత్తయ్య(జీవి) అతన్ని భవానీప్రసాద్ భార్య సురేఖ(రమ్యకృష్ణ) ముందు ప్రవేశ పెడతాడు. సురేఖ భవానీప్రసాద్ ఎవరో కాదని రంగ సోదరుడంటుంది. భవానీప్రసాద్ తల్లికి ఫ్యాక్షన్ అంటే ఇష్టంలేక పుట్టింటికి వెళ్తుండగా దారికాచి ప్రత్యర్థులు హతమార్చబోగా నిండు చూలాలైన ఆమె రంగను ప్రసవించి తెలంగాణ శకుంతలకు ఇచ్చిన విషయం చెబుతుంది. రంగ భవానీప్రసాద్‌గానే కొనసాగి పులిచర్ల ఫ్యాక్షనిస్టులను అంతమొందించమంటుంది. ఎస్పీ ద్వారా ప్రత్యర్థులు సింహపురిలో ఉన్నది భవానీ కాదు రంగ అని తెలుసుకొంటారు. భవానీప్రసాద్ అనుచరులందరినీ తెగనరుకుతారు. తెలంగాణ శకుంతలను కిరాతకంగా చంపడంతో తట్టుకోలేని రంగ తన విశ్వరూపం చూపి పులిచర్ల ఫ్యాక్షనిస్టుల ఫ్యామిలీనంతా ప్యాకేజీగా లేపేస్తాడు. తన అన్న చిరకాల స్వప్నమైన నీటిపారుదల ప్రాజెక్ట్‌ను కట్టి బాంబుల సీమలో బంగారు పంటలు పడించడంతో చిత్రం ముగుస్తుంది. దర్శకుడు జీవి పుర్వాశ్రమంలో లాయర్. తర్వాత సినిమాల్లో విలన్. సినీ పరిశ్రమను నిశితంగా పరిశీలిస్తూనే రంగ ది దొంగను జనరంజకం చేయడంలో బొక్క బోర్లా పడ్డాడాయన. 

## స్టార్ అని ఫీల్ కావడం లేదు



ఏమాయ చేసావె చిత్రంతో తెలుగు ప్రేక్షకులకు పరిచయమైన హీరోయిన్ సమంత బృందావనం చిత్రంతో పరిశ్రమలో నిలదొక్కుకొంది. మహేష్‌బాబు సరసన ఆమె నటిస్తున్న దూకుడు చిత్రం తెలుగు పరిశ్రమలో ఇంకాస్త పైస్థాయిలో నిలబెడుతుందని ఆమె విశ్వసిస్తుంది. ఈ విషయమై ఆమె మాట్లాడుతూ ఒక విజయం దక్కితేచాలు ఇక నేను స్టార్ అయిపోయానని భావించే మనస్తత్వం కాదు నాది. ఇటువంటి లెక్కలేసుకొని నడుచుకొనే అలవాటు నాకు ఎప్పటికీ రాదని అనుకొంటున్నా. ప్రతి అడుగునూ జాగ్రత్తగా వెయ్యాలనే భావిస్తా. జయాపజయాల మాటెలా వున్నా నేనో సాధారణ అమ్మాయిననే మాట ఎప్పటికీ మర్చిపోను. ఒక్క సినిమాతోనో, ఒక విజయంతోనో మనం ఇక్కడ అన్నీ నేర్చుకోలేం. ప్రతి క్షణం నేర్చుకోవాల్సి వుంటుందంది.

## ప్రేమ పంచిపెడుతున్నాను



ఒకప్పటి విశ్వసుందరి సుస్మితాసేన్ చేతిలో పెద్దగా చిత్రాలు లేకపోయినా నిరంతరం వార్తల్లో వుంటుంది. ఇంకా పెళ్లి చేసుకోని ఆమె ఇద్దరు పిల్లలను దత్తత తీసుకొని పెంచుతుంది. పాక్ వెటరన్ క్రికెటర్ వసీం అక్రమ్‌తో ప్రేమాయణం సాగిస్తుందనే వార్తలు కూడా వస్తున్నాయి. ఇటీవల హైదరాబాద్ వచ్చిన ఆమెను మీరు మంచి తల్లి మాత్రమే గానీ, మంచి ప్రేమికురాలు కాదన్నట్లుందే అంటే అలా ఎప్పటికీ ఒప్పుకోను. నాకు చాలా మంది బాయ్‌ఫ్రెండ్స్ వున్నారు. వారందరిని ప్రేమించాను, సంతోష పెట్టాను. నా 22ఏట పెళ్లి చేసుకుందామనుకొన్నా. కానీ చేయాల్సిన పనులు చాలా వున్నాయి. అందువల్లే కొంత లేటైంది. ఇప్పుడు నేను పెళ్లికి రెడీ. అబ్బాయి దొరకటం లేదు. అందుకే రెండు సంవత్సరాల తర్వాత పెళ్లి చేసుకోవాలని కచ్చితమైన నిర్ణయం తీసుకొన్నానంటుంది.

## తెలుగులో స్థిరపడతాను



మోడల్‌గా జీవితాన్ని మొదలుపెట్టి టాలీవుడ్‌లో తొలి అడుగులు వేసిన హీరోయిన్ దీక్షాసేథ్ పంజాబీ యువతి. ప్రస్తుతం మిరపకాయ్, వాంటెడ్ చిత్రాల్లో నటించే అవకాశం వచ్చింది. ఈ వారంలో ఈ సినిమాలు విడుదలవుతున్న సందర్భాన్ని పురస్కరించుకొని పిచ్చాపాటీగా మాట్లాడుతూ నా రూపురేఖలు తెలుగమ్మాయిలా వుంటాయి. అందం... ఒడ్డూ పొడుగు... అందుకు తగ్గ ఆహార్యం నన్ను నాయికగా నిలబెడతాయి. దర్శకుల సూచనల మేరకు పాత్రలో ఒదిగిపోగల లక్షణం వుంది. చిట్కాలు పాటిస్తే ఇక్కడ విజయం వచ్చి మన పక్షాన చేరదు. అందుకే ముందు నాలోని గ్లామర్‌ను కాపాడుకొంటాను. నటనలో దర్శకులు చెప్పింది చేస్తాను. తెలుగు పరిశ్రమలో హీరోయిన్‌గా స్థిరపడాలను కొంటున్నాను కాబట్టి తెలుగుభాష కూడా నేర్చుకొంటున్నానంటుందీ సుందరి.

## కొత్తగా ఏం చేస్తాం?



హీరోయిన్ విమలారామన్ నటించిన రంగ ది దొంగ, రాజ్ చిత్రాలు విడుదలయ్యాయి. ఈ సందర్భంగా పిచ్చాపాటీగా ఆమెతో మాట్లాడుతూ ఇద్దరు హీరోయిన్లు వున్న సినిమాల్లో ఎక్కువగా కనిపిస్తున్నారు. సౌకర్యంగా వున్నారా అంటే; మీరన్నట్లు సినిమాలో మరో కథానాయిక కూడా వుంది కదా? వాళ్లకు లేని సమస్య నాకెందుకుంటుంది. పాత్ర, నటన బాగుంటే చాలు రావాల్సిన గుర్తింపు అదే వస్తుందంది. ఎక్స్‌పోజింగ్ బాగా చేస్తున్నారే అంటే ఎక్స్‌పోజింగ్ చేసినా, బికినీ వేసినా పాత్ర పరిధి మేరకే. కొత్తగా మనం చెయ్యడమంటూ ఏముందిక్కడంది విమలారామన్.

## తెలుగుకు తొలి ప్రాధాన్యం



టాలీవుడ్‌లో కోటిరూపాయలు పారితోషికం తీసుకొన్న కథానాయికగా ఇలియానా రికార్డు సృష్టించింది. దేవదాసు, పోకిరి, ఖతర్నాక్, రాఖీ, జల్సా, కిక్ సినిమాలు ఇలియానాను పరిశ్రమలో నిలబెట్టాయి. 2011లో ఆమె అనురాగ్ బసు దర్శకత్వంలో తయారయ్యే హిందీ చిత్రంలో నటించను ఒప్పుకొంది. ఇక బాలీవుడ్‌పైనే దృష్టి పెడతారా అంటే నటిగా నాకంటూ భాషాపరమైన హద్దుల్లేవు. ఎక్కడికి వెళ్లినా నేను టాలీవుడ్‌ను మరచిపోను. ఇలియానా అనే నటిని ప్రేక్షకులకు చేరువ చేసింది తెలుగు సినిమాయే. ఎప్పుడైనా నా తొలి ప్రాధాన్యం తెలుగు సినిమాకేనని తేల్చి చెప్పింది ఇలియానా.

## చుక్కలనంటుతున్న పసిడి ధరలు



రోజు రోజుకు పై పైకి ఎగబాకుతున్న పుత్తడి ధర.

పసిడి ధరలు ఆకాశాన్నంటుతున్నాయి. రోజురోజుకు పెరిగిపోతున్న బంగారం ధరలు చూసి కొనుగోలుదారులు హడలి పోతున్నారు. నాలుగు నెలల కాలంలో అమాంతంగా ధరలు పెరగడం వ్యాపార వర్గాలను ఆశ్చర్య చకితులను చేస్తున్నది. గత రెండు మూడేళ్లలో బంగారం ధరలు రెక్కలు వచ్చినట్లు ఊహించనంతగా పెరుగుతుండడంతో పెళ్లిళ్లు, ఇతర వేడుకలకు బంగారు ఆభరణాలు కొనుగోలు చేసేవారు దిక్కుతోచని స్థితిలో పడిపోతున్నారు. 2008లో గ్రాము ధర 1200 రూపాయలు వుండగా 2009కు 1499 రూపాయలకు చేరుకొంది. 2010 సంవత్సరం చివరలో ఏకంగా 1923 రూపాయలు అయ్యింది. రోజురోజుకు ఇది క్రమంగా పెరుగుతుండడంతో బంగారు ప్రియులు ముఖ్యంగా సాధారణ, మధ్యతరగతి వర్గాలపై తీవ్ర ప్రభావం చూపుతోంది. అంతంత ధరలు పెట్టి బంగారు ఆభరణాలు కొనలేక, పెళ్లిళ్ల వంటి కార్యక్రమాలకు సైతం బంగారానికి దూరంగా వుండాల్సి వస్తోంది. పసిడితో పాటు వెండి కూడా ధరలో పోటీ పడుతుంది. ఒక్కసారిగా వెండి కేజి ధర 24వేల రూపాయలు పెరగడం విశేషం. 2008లో 17వేల రూపాయలున్న కేజి వెండి ధర 2009లో 22వేలకు ఎగబ్రాకింది. 2010 చివరకు వచ్చేసరికి ఏకంగా 24వేలు పెరిగి 46వేలకు చేరుకోవడం విశేషం.

## నెల్లూరును కప్పిన మంచు దుప్పటి



మంచు కురిసే వేళలో...

వాతావరణ పరిస్థితులలో ఏర్పడిన మార్పుల ప్రభావంతో జిల్లాలో చలి అధికమైంది. గతంలో ఎన్నడూలేనంతగా చలి వణికిస్తుండడంతో ప్రజలు తీవ్ర ఇబ్బందులకు గురౌతున్నారు. పిల్లలు, పెద్దలు గడగడ వణికించే చలి పులి కారణంగా అనారోగ్యం పాలవుతున్నారు. నెల రోజులుగా చలి తీవ్రత అధికంగా వుంది. దీనికితోడు రెండు రోజులుగా క్రమ్ముకున్న పొగమంచు జనజీవనాన్ని అస్తవ్యస్తం చేస్తోంది. ఉదయం పది గంటలైనా పొగమంచు విడవకపోవడంతో వివిధ పనులు, వ్యాపారాలు, ఉద్యోగాలకు వెళ్లేవారు హడలి పోతున్నారు. రవాణా వ్యవస్థపై ఇది తీవ్ర ప్రభావాన్ని చూపుతోంది. దట్టంగా అలుముకొన్న పొగమంచు కారణంగా రహదారులు కన్పడక, ఎదురుగా వచ్చే వాహనాలు కన్పించక వాహనాలు నడిపేవారు ఇబ్బంది పడుతున్నారు. ఈ పొగమంచు ప్రమాదాలకూ కారణమవుతోంది. రైళ్ల రాకపోకలకు ఆటంకం కల్గుతోంది. ముందు ముందు అధికంగా వుంటుందేమోనని నగర వాసులు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు.

## సంచలనం సృష్టించిన విద్యార్థి హత్య

విద్యార్థుల మధ్య కళాశాలలో ఏర్పడిన స్వల్ప వివాదం ఒకరి ప్రాణాలు తీసేవరకు వెళ్లడం వారిలో గూడుకట్టుకొన్న కసిని, మారుతున్న మనస్తత్వాలను తెలియజేస్తుంది. 2010 సంవత్సరానికి వీడ్కోలు పలుకుతూ, క్రొత్త సంవత్సరానికి స్వాగతం చెప్పే సమయంలో విద్యార్థి హత్య జరగడం నగరంలో సంచలనం కల్గించింది. భక్తవత్సలనగర్‌కు చెందిన సాయికుమార్, రంగనాయకుల పేటకు చెందిన దిలీప్‌లు స్థానిక కృష్ణచైతన్య డిగ్రీ కళాశాలలో బికాం ద్వితీయ సంవత్సరం చదువుతున్నారు. వీరి మధ్య చిన్న చిన్న తగాదాలు జరుగుతుండేవి. ఇటీవలకాలంలో ఇవి తారాస్థాయికి చేరుకొన్నాయి. ఈ పరిస్థితులలో సాయికుమార్ తనపై దిలీప్ వర్గం దాడి చేయబోతోందని గ్రహించి తన బంధువైన రాజేష్ అనే వ్యక్తిని పిలిపించుకొని ఇరువురు సాయంత్రం 6.30 గంటలకు కళాశాల నుంచి విఆర్‌సి సెంటర్‌కు నడచి వస్తుండగా అప్పటికే బిఎస్‌ఎన్‌ఎల్ కార్యాలయం వద్ద కాపుకాసిన దిలీప్ అతని మనుషులు ఒక్కసారిగా సాయికుమార్‌పై కత్తులతో దాడి చేశారు. తీవ్రంగా గాయపడిన అతన్ని జయభారత్ హాస్పిటల్‌కు తరలించి చికిత్స చేస్తుండగా ప్రాణాలు కోల్పోయినట్లు పోలీసులు తెలిపారు. నగర డిఎస్పీ రాధిక, సిఐ వీరాంజనేయరెడ్డి తదితరులు కేసు దర్యాప్తు చేస్తున్నారు.

### పౌరసరఫరాల శాఖ షాపింగ్‌మాల్‌లు!

జిల్లాలో పౌరసరఫరాల శాఖ ఆధ్వర్యంలో చౌక దుకాణాల ద్వారా అవసరమైన సరుకులను పంపిణీ చేసేందుకు ప్రభుత్వం శ్రీకారం చుట్టింది. షాపింగ్‌మాల్ పేరుతో అతి తక్కువ ధరకే నిత్యావసర వస్తువులు అందించనున్నారు. గ్రామీణ ప్రాంతమైన నిడుముసలిలో రేషన్ కార్డులు కలిగిన వారికి సరుకులు అందించేందుకు శ్రీకారం చుట్టారు. బయట మార్కెట్లో ఇప్పటికే నిత్యావసర వస్తువుల ధరలు ఆకాశాన్నంటడంతో సామాన్య ప్రజలు కొనలేని పరిస్థితి ఏర్పడింది. వీరికి అధిక ధరల నుంచి ఊరట కల్గించాలన్న ఉద్దేశ్యంతో పౌరసరఫరాల శాఖ ఈ నిర్ణయం తీసుకుంది.

## ఆహార సంక్షోభం తప్పేట్లు లేదు



వెంకయ్యనాయుడు జోస్యం.

వ్యవసాయరంగం పట్ల ప్రభుత్వం వ్యవహరిస్తున్న తీరు కారణంగా దేశంలో ఆహార సంక్షోభం ఏర్పడే ప్రమాదముందని బిజెపి సీనియర్ నేత ఎం.వెంకయ్యనాయుడు ఆందోళన వ్యక్తం చేశారు. వెంకటాచలంలోని స్వర్ణభారత్ ట్రస్ట్‌లో జరిగిన గోపాలమిత్ర శిక్షణా కార్యక్రమంలో ఆయన పాల్గొని ప్రసంగించారు. దేశంలో అత్యధికంగా 60 శాతం మంది వ్యవసాయ రంగంపై ఆధారపడి జీవిస్తున్నారని చెప్పారు. ప్రభుత్వాలు వ్యవహరిస్తున్న విధానాల వల్ల వ్యవసాయానికి రైతాంగం స్వస్తిపలికే సూచనలు కన్పిస్తున్నాయన్నారు. అదే జరిగితే దేశంలో ఆహార, ఆర్థిక సంక్షోభం తప్పదన్నారు. వీటన్నింటినీ దృష్టిలో వుంచుకొని వ్యవసాయ శాస్త్రవేత్త డాక్టర్ స్వామినాథన్ చేసిన సిఫార్సులను అమలు జరపాలని డిమాండ్ చేశారు. వ్యవసాయ రంగంలో మార్పులు చూసి పునరుజ్జీవింప జేయాల్సిన అవసరం ఎంతైనా వుందన్నారు. వ్యవసాయ ఉత్పత్తుల అమ్మకాలకు సంబంధించి సుంకాలను రద్దు చేయాలని, తక్కువ వడ్డీకి బ్యాంకు రుణాలు అందించాలని, ధాన్యం రవాణాపై వున్న ఆంక్షలను ఎత్తివేయాలని, గ్రామాల్లో మౌలిక సదుపాయాలు కల్పించాలని ఆయన డిమాండ్ చేశారు.

- స్టాండింగ్ కమిటీ

## ఆదేశాలు బేఖాతరు

జిల్లా పరిషత్ చైర్మన్ అధ్యక్షతన వివిధ శాఖలకు సంబంధించిన అంశాలపై స్థాయి సంఘ సమావేశాలు జరుగుతున్నాయి. జడ్పీ సర్వసభ్య సమావేశంలో తీసుకున్న నిర్ణయాలతోపాటు స్థాయి సంఘ సమావేశాలలో ఆమోదించిన అంశాలను అమలు చేయాల్సి వుంటుంది. అయితే సంబంధింత శాఖ అధికారులు మాత్రం ఈ దిశగా కృషి చేయడం లేదు. సంక్షేమ శాఖలు, వ్యవసాయం, పంచాయితీరాజ్, ఆర్ అండ్ బి, గ్రామీణాభివృద్ధి, వైద్య ఆరోగ్యం, త్రాగునీటి సరఫరా, విద్యాశాఖ, తదితర శాఖల పనితీరుపై జడ్పీ చైర్మన్ స్థాయి సంఘ సమావేశాల్లో సమీక్షిస్తుంటారు. కొన్ని శాఖలకు చెందిన జిల్లా ఉన్నతాధికారులు స్థాయి సంఘ సమావేశాలకు డుమ్మా కొడుతున్నారు. వీరికి బదులు కిందిస్థాయి సిబ్బందిని సమావేశాలకు పంపడంతో వీరు పూర్తి వివరాలు వెల్లడించలేక పోతున్నారు. అరకొర సమాచారంతో వస్తుండడంతో జడ్పీ చైర్మన్‌తోపాటు సమీక్షకు హాజరైన జడ్పీటీసిలు అసహనానికి గురి కావాల్సి వస్తుంది. ఒక సమావేశంలో తీసుకున్న నిర్ణయాన్ని మరో సమావేశానికి వచ్చే సమయంలో అమలుచేసి నివేదికలు తీసుకురావాలని ప్రతిసారి ఆదేశిస్తున్నా ఒక్కరు కూడా పట్టించుకోవడం లేదు. దీంతో ప్రజలకు సంబంధించి వివిధ కార్యక్రమాలు అమలుకు నోచుకోలేక పోతున్నాయి.



జడ్పీ చైర్మన్ మాట వినడం లేదు.

- విశ్వశాంతి ఆశ్రమంలో

## ప్రత్యేక పూజలు



చండీయాగం చేస్తున్న మాతృశ్రీ విజయేశ్వరీదేవి.

పెంచలకోనలోని విశ్వశాంతి ఆశ్రమంలో నూతన సంవత్సరాన్ని పురస్కరించుకొని పలు ప్రత్యేక కార్యక్రమాలు జరుగుతున్నాయి. జనవరి 1వ తేది చండీయాగాన్ని మాతృశ్రీ విజయేశ్వరీదేవి నిర్వహించారు. దేశంలో సకాలంలో వర్షాలుపడి, పంటలు బాగా పండి జనం సుభిక్షంగా వుండాలని ఈ యాగం చేసినట్లు చెప్పారామె. ఈ నెల 26, 27 తేదీల్లో నాలుగు నుంచి 18 సంవత్సరాలలోపు పిల్లలకు నాలుకపై సరస్వతీ బీజాక్షరాలు లిఖించే కార్యక్రమం చేపడతామన్నారు. ఫిబ్రవరి 4, 5, 6 తేదీల్లో జ్ఞాన శిక్షణా శిబిరాలు నిర్వహిస్తామన్నారు. భక్తులను ఈ కార్యక్రమాల్లో పాల్గొమని విజయేశ్వరీ దేవి కోరుతున్నారు.

## ట్రిబ్యునల్ తీర్పు

15వ పేజీ కొరవ

వల్ల, ఒక మోస్తరు వరద వచ్చినప్పుడు కూడా మనకు పుష్కలంగా నీరు లభిస్తుంది. ఆ వరద నీటిపై రానున్న యాభై ఏళ్లపాటు మనకు పూర్తి స్థాయి హక్కు లభించింది. దాని వల్ల ఇప్పటి వరకు నీటి కేటాయింపులు లేని ప్రాజెక్టులను నిశ్చితంగా నిర్మించుకోవచ్చు. కృష్ణా నదిలో సరాసరిన ప్రతి రెండు సంవత్సరాలకు ఒకసారి వరద వస్తున్న చరిత్ర వుంది కాబట్టి, ఈ వరద జలాల మీద ఆధారపడే ప్రాజెక్టులకు అంత మేరా నీటి హామీ వుంటుంది.

తీర్పు వల్ల మనకు జరిగిన చెడులో ప్రధానమైనది – నికర జలాల కేటాయింపు తతిమా రెండు రాష్ట్రాలకు పెరిగినంతగా మనకు పెరగక పోవడం. మిగులు జలాలలో మన హక్కు కోల్పోవడం, తతిమా రెండు రాష్ట్రాలకు హక్కు లభించడం. ఆల్మట్టి ఎత్తు పెంపువల్ల కృష్ణా డెల్టా వ్యవసాయ సీజన్‌కు నష్టం జరగడం.

## వివేకా

16వ పేజీ కొరవ

పగల గొట్టారు. ఆ రాత్రికే కాపువీధి చెట్టు క్రింద బేరం, ఐదు లక్షలు చేతిలో పడగానే కూలగొట్టిన గోడల స్థానంలో కొత్తవి కట్టుకోవడానికి అనుమతి.

ఆదిత్య నగర్‌లో దాదాపు 14 అపార్ట్‌మెంట్ భవనాల మీద పెంట్ హౌస్‌లు నిర్మించుకోవడానికి అనుమతి మంజూరు చేశాడు వివేకానందరెడ్డి. ప్రతి అపార్ట్‌మెంట్ యజమాని అందుకు గాను ఆయనకు ఒక అపార్ట్‌మెంట్‌తోపాటు, అదనంగా కట్టే పెంట్ హౌస్‌లో సగం విలువ ఇచ్చే ఏర్పాటు. ఈ లావాదేవీల్లోనే ఆయనకు దాదాపు ఐదు కోట్ల రూపాయల ఆస్తులు లభించాయి ఈ నెలలో.

చిల్డ్రన్ పార్క్ నుంచి జాతీయ రహదారి వరకు వేస్తున్న సిమెంట్ రోడ్డు ఆయన పాలిట కామధేనువుగా మారింది. రోడ్ విస్తరణ పేరుతో పక్కనున్న ఇళ్ల మీద గుర్తులు పెట్టడం, వారు దిగివచ్చి, చేతులు తడిపితే రోడ్ విస్తరణ మానుకోవడం, లేదంటే ఇళ్లు పగలగొట్టి మరీ వెడల్పు చేయడం జరిగి పోతున్నది. ఈ లంచాల కక్కుర్తి వల్ల ఆ రోడ్ పాములవలె మెలికలు తిరుగుతున్నది. దాదాపు మూడు కోట్ల రూపాయలు రోడ్ విస్తరణ పేరిట దండుకొన్నాడట. వివేకా మాట కాదంటే తమ ఇళ్లు రోడ్లల్లో కలిసి పోతాయనే భయంతో అక్కడ ఇళ్లున్న వారంతా రాజుకు కప్పం కట్టినట్లు ముడుపులు చెల్లించి వస్తున్నారు. ఇట్లా చెప్పుకొంటూపోతే వివేకానందరెడ్డి అవినీతి దాహానికి అంతు పంతు కనపడడం లేదు. ఎమ్మెల్యే పదవిని ఇంత బరితెగింపుగా జనాన్ని పీడించడానికి సాధనంగా వాడే అధములు మన జిల్లాలో, మనకు తెలిసిన చరిత్రలో మరొకరు లేరు. భక్తవత్సలనగర్ మహిళల వలె ప్రతి వీధిలో జనం చెప్పు, చీపురు పట్టుకొని తరిమి కొట్టే రోజు వస్తే తప్ప ఆయనలో మార్పు వచ్చే సూచన కన్పడడం లేదు.

## పెంచలరెడ్డి

16వ పేజీ కొరవ

చాలా నిర్మాణాలే చేయించారు ఆదినారాయణరెడ్డి కుటుంబీకులు. ఒక్క మాటలో చెప్పాలంటే అమ్మ వారి గుడికి ఇప్పుడున్న కొత్త శోభ సమస్తం ఆల్తూరు ఆదినారాయణరెడ్డి భక్తి సమర్పణే కావడం విశేషం.

అయితే ఇదే సమయంలో మరికొందరు సంపన్న భక్తులు కూడా అమ్మ వారికి భారీ విరాళాలు ఇచ్చారు. వాటి ఖర్చు మొత్తం సన్నపరెడ్డి పెంచలరెడ్డిది కావడంతో లెక్కా పక్కా లేవు. ఎవరెంత ఇచ్చారు, ఎంత ఖర్చు పెట్టారని అడిగితే ఎగ్జిక్యూటివ్ అధికారిణి దగ్గర సమాధానం లేదు. ఆమె ఈ గుడికి అధికారిణిగా వచ్చినప్పటి నుంచి, పూర్తిగా పెంచలరెడ్డి నియంత్రణలోనే నడుచుకొంటున్నదని సిబ్బంది చెప్తున్నారు. వారిద్దరూ ఆఫీసు గదిలో కూర్చుని దేవస్థానానికి సంబంధించిన అన్ని నిర్ణయాలు తీసుకోవడం ఆనవాయితీ అయిపోయింది. వారా గదిలో వున్నప్పుడు హరిహర బ్రహ్మాదులు కూడా లోపలకు అడుగు పెట్టడానికి వీలు లేకుండా వాకిట్లో కాపలా పెడతారట. ధర్మకర్తలు కీలుబొమ్మలు మాత్రమే. అమ్మ మాలధారణ పేరిట పెద్ద మొత్తంలో చందాలు దండి జేబులో వేసుకోవడం పెంచలరెడ్డికి ఒక వ్యాపారంగా మారిపోయిందని భక్తులు చెప్తున్నారు. ఆయన్ను కాదంటే, గుడి లోపల ఎవరికైనా తీవ్ర అవమానాలు తప్పవు. దానితో తమ దృష్టికి వచ్చిన తప్పులను కూడా పట్టించుకోకుండా వదిలి వేయడం అలవాటు చేసుకొన్నారు పూజారులు, సిబ్బంది.

దేవస్థానం హుండీ ద్వారా, పూజల రుసుము ద్వారా వచ్చే లక్షలాది రూపాయల నిధులు వీరికి కైంకర్యమై పోతున్నాయని అలజడిగా వుంది. వాహనశాల, ఎయిర్ కండిషన్ కొనుగోలు వంటి పనులను తాను చేయించినట్లుగా పెద్ద బోర్డు వేసుకొని వున్నాడు పెంచలరెడ్డి. కానీ నిజానికి వాటిలో ఆయన పెట్టిన పైసా కూడా లేదు. ఇతర దాతల పక్కన తన పేరు వ్రాసుకొని తనకు తానొక దాతగా గొప్పలు చెప్పుకోవడం ఆయన సరదా. ఆయన, ఇఓ గారి పెత్తనంలో దేవస్థానం పేరిట బ్యాంకులలో వుండిన లక్షలాది రూపాయల ఫిక్స్‌డ్ డిపాజిట్లు కరిగి మాయమైపోయాయి.

జిల్లాలోనే ప్రాధాన్యత సంతరించుకొన్న గుడిలో ఒక రాజకీయ వ్యాపారి పెత్తనం, దోపిడీ నిరాటంకంగా కొనసాగడం విచారకరం. గత వారం తన అక్రమాలపై 'జమీన్‌రైతు'లో వచ్చిన వార్తలకు వెర్రెత్తినవాడి వలె మాటలు తూలుతున్నాడు పెంచలరెడ్డి. ఆయనేదో సచ్చీలుడైనట్లు, పత్రికలలో వ్రాసినవన్నీ అబద్ధాలైనట్లు గోల చేస్తున్నాడు. కానీ దేవస్థానం వరకు ఆయన దుర్మార్గాలు గత వారం వచ్చింది చాలా కొంచమని భక్తులు, సిబ్బంది చెప్తున్నారు. వినే ఓపిక వుండాలే కానీ, వారు చెప్పే అవినీతికథలు వినడానికి రోజులు పట్టేట్లుంది. గుడులను కూడా తన అనుచరుల అక్రమాలకు నిలయాలుగా మార్చడంలో ఎమ్మెల్యే వివేకానందరెడ్డికి ఏ సంతోషం కల్గుతుందో అర్థం కావడం లేదు. అయ్యా ఎమ్మెల్యే దొరవారూ, మీ తప్పుడు పనులకు కనీసం గుడులైనా వదలి పెట్టాలని మా విన్నపం.



## శ్రీకృష్ణ కమిటీ

మొదటి పేజీ కొరవ

కమిటీ. ఆవేశకావేషాలు తగ్గించడానికి కొంత కాలయాపన చేయడం తప్ప ఈ కమిటీ వల్ల ఒరిగింది ఏదీ లేదు. అది సూచించిన ఐదు సూచనలలో ఒకదాని పట్ల ఏకాభిప్రాయం సాధించాలన్నది చిదంబరం కోరిక. అది అసాధ్యం. ఏ ప్రాంతానికా ప్రాంతం తమ వాదనపై పట్టుబట్టడం తప్ప, ఒకరి కోసం మరొకరు రాజీపడే సామరస్య వాతావరణం లేదు. అందువల్లనే తెలుగుదేశం, కాంగ్రెస్ పార్టీలు రెండూ కరవమంటే కప్పకు కోపం విడవమంటే పాముకు కష్టం అన్నట్లు ఇబ్బంది పడుతున్నాయి. అధికారికంగా ఇదీ మా పార్టీ విధానమని చెప్పగలిగే స్థితిలో లేరు వారు. రాజకీయ పార్టీల్లోనే దీనిపై ఏకాభిప్రాయం లేనప్పుడు, ప్రజలలో అది ఎట్లా సాధ్యం?

తెలంగాణ ఉద్యమాన్ని ముందుకు నడిపిస్తున్న కెసిఆర్, గద్దర్‌లు ఇద్దరూ ఈ నివేదికను చెత్త కాగితం క్రింద తీసి పారేశారు. దానికి తాము ఎటువంటి విలువ ఇవ్వడం లేదని ప్రకటించారు. తెలంగాణ కోసం తమ ఉద్యమం కొనసాగిస్తామని శపథం చేశారు. కాంగ్రెస్ తెలంగాణ ఎమ్మీలు అనవసర ఆవేశాలకు పోయి, అనర్థం కొని తెచ్చుకొన్నారు. శ్రీకృష్ణ కమిటీ తెలంగాణ ఇచ్చేస్తుందనే తప్పుడు అంచనాతో ఆ ఘనత కెసిఆర్ కొట్టేస్తాడనే భయంతో తాము ముందు వుండాలని నానా యాగీ చేశారు వారు. ఇప్పుడు కమిటీ నివేదిక నిరాశ పరిచింది. కేంద్ర నాయకత్వం నోరుమూసుకొని కూర్చోమని మొట్టికాయ వేసింది. అధిష్టానం చెప్పిందని పూరుకుంటే, తెలంగాణలో తమకు రాజకీయంగా పుట్టగతులు వుండవని వారి భయం. అందువల్ల ఏమిచేయాలో పాలుపోక జుట్టు పీక్కొంటున్నారు.

తెలుగుదేశం పార్టీది ఇంతకంటే ఘోరమైన పరిస్థితి. చంద్రబాబు నాయుడు ఇంత కాలం ఎటూ తేల్చి చెప్పకుండా నాటకాలాడాడు. కాంగ్రెస్ చెప్పిన తర్వాత తమ మాట బయట పెడతామని పార్టీ నేతలకు చెప్తూ కాలం నెట్టుకొంటూ వచ్చాడు. దానివల్ల తెలంగాణలో టిడిపి చాలా నష్టపోయిందని పరిశీలకుల భావన. ఈ విషయం ఆ పార్టీ నేతలకు కూడా అర్థమైంది. ఏదో ఒక విపరీత చర్య చేపడితే తప్ప తాము రాజకీయంగా బ్రతకలేమని నాగం, కడియం, ఎర్రబల్లి వంటి నేతలు ఆవేశపడుతున్నారు. పోచారం శ్రీనివాసరెడ్డి వంటి వారు విసిగిపోయి పార్టీ వదిలేయాలన్న నిర్ణయానికి వచ్చారు. క్రింది స్థాయిలో ఈ వలసలు మరింత ఎక్కువగా వున్నాయి. వాటిని నిరోధించాలంటే తెలంగాణ మీద టిడిపి నిర్దిష్టమైన అభిప్రాయం చెప్పాలి. కానీ అందుకు చంద్రబాబు ఇప్పటికీ సిద్ధంగా లేదు. దానివల్ల ఆంధ్ర, తెలంగాణ రెండింటిలో నష్టపోతామన్నది ఆయన వాదన. మొత్తానికి రాష్ట్రంలో మరొకసారి తీవ్ర స్థాయి రాజకీయ గందరగోళం, తెలంగాణ ఉద్యమ వేడి పెరిగి పోయాయి. తమ భవిష్యత్ కార్యాచరణ మీద అన్ని పార్టీలు అయోమయంలో వున్నాయి.

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

అంకిత భావం నిజాయితీలకు సంకేతంగా వ్యవహరించే నిఖార్సైన అధికారి, మాచర్లలో సిఐగా పని చేస్తున్న నెల్లూరీయుడు డి.వెంకటేశ్వర్లు తీవ్రమైన మధుమేహ వ్యాధితో అకాలంగా మరణించాడు. నీతి నిజాయితీలను నమ్ముకొని తన కుటుంబాన్ని నడివీధిలో వదలి వెళ్లిపోయిన అతి మంచివాడు వెంకటేశ్వర్లు. ఇటువంటి వారి జీవితాలను చూసినపుడు, నీతిగా వుంటే చివరకు మిగిలేది ఇదే కదా అన్న నిస్పృహ కల్గుతుంది ఒక్కొక్కసారి. ఆయన కుటుంబానికి మా సానుభూతి తెలియజేస్తున్నాము.

## లేబూర్ సర్పంచ్ మరణం

ఇందుకూరుపేట మండలంలోని లేబూరు పంచాయితీ సర్పంచ్ మన్నెమాల చంద్రశేఖర్‌రెడ్డి (55) 3వ తేదీ మరణించారు. చంద్రశేఖర్‌రెడ్డి జనాభిమాని. మండలంలో కాంగ్రెస్ పార్టీ ముఖ్య నాయకునిగా గుర్తింపు పొందారు. ఆయన లేబూరు గ్రామ దేవత కుంకాళమ్మ దేవస్థానంతోపాటు గ్రామాభివృద్ధికి విశేష కృషి చేశారు. వారి కుటుంబానికి మా సానుభూతి.

## జనవాణి

2వ పేజీ కొరవ

దేశ కీర్తిప్రతిష్టల స్థాయి దిగజారింది. ఈ అనుభవాన్ని దృష్టిలో వుంచుకొని త్వరలో చంద్రునిపైకి మానవుని పంపేందుకు మన శాస్త్రజ్ఞులు చేస్తున్న చంద్రయాన్ పరిశోధన దిగ్విజయమయ్యేలా ఇస్రో శాస్త్రవేత్తలు కృషిచేయాల్సిన అవసరం ఎంతైనా వుంది.

సి.హెచ్.హనుమంతరావు నెల్లూరు

### సీనియర్ సిటిజన్లకిచ్చే వడ్డీ పెంచండి!

నేడు జీవితాలు ఆర్థిక భారంతో కృంగిపోయి కుంటుకొంటూ సాగుతున్నాయి. ముఖ్యంగా సీనియర్ సిటిజన్లకు ఎన్నో సమస్యలు. వైద్యం ఖరీదై పోవడంతో రోజులు లెక్కబెట్టుకోవాల్సి వస్తుంది. సీనియర్ సిటిజన్స్‌కు బ్యాంకులు 0.5 అధిక శాతం వడ్డీ చెల్లించినా అది ఏ మూలకు? కొన్ని బ్యాంకులు ఒక శాతం చెల్లిస్తున్నాయి. ప్రభుత్వ బ్యాంకులన్నీ ఒక శాతం వడ్డీ ఇస్తే డిపాజిట్లు మార్చే తిప్పలు తప్పుతాయి. ఈ విషయంలో కేంద్ర ప్రభుత్వం, బ్యాంకర్లు ఒక నిర్ణయం తీసుకోవాలి.

ఎం.సుబ్బరామయ్య నెల్లూరు

**• ఉరుములేని పిడుగు**

# కృష్ణా జలాలపై ట్రిబ్యునల్ తీర్పు!

కృష్ణా జల వివాదాల ట్రిబ్యునల్ తీర్పు ఉరుములేని పిడుగు వలె జనం నెత్తిన పడింది. శ్రీకృష్ణ కమిటీ నివేదిక ముచ్చట్లతో అందరూ అదమరచి వున్న సమయంలో వెలువడిన ఈ తీర్పును చూసి రాష్ట్రమంతా ఉలిక్కిపడక తప్పలేదు. కృష్ణా జలాలంటే మాటలు కాదు. సగం రాష్ట్రం రైతాంగం బ్రతుకు సమస్య అది. కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, నల్గొండ, ఖమ్మం, కడప, కర్నూలు, మహబూబ్‌నగర్ జిల్లాలు పూర్తిగా, చిత్తూరు జిల్లా పాక్షికంగా కృష్ణా జలాల మీదనే ఆధారపడి వున్నాయి. ఆ నీళ్లలో ఏ చిన్న లోటు వచ్చినా దాదాపు కోటిన్నర ఎకరాలలో పంటలు ఎండిపోతాయి. లక్షలాది మంది రైతుల జీవితాలు ఛిద్రమై పోతాయి. కృష్ణా నదిలో ప్రతి నీటి చుక్క విలువైనదే. దాని నీళ్ల ఆశతో ఎన్ని ప్రాజెక్టులు కట్టుకున్నాం మనం? ఇంకెన్ని నిర్మాణంలో వున్నాయి? 150 ఏళ్ల క్రితమే ప్రకాశం బ్యారేజ్ నిర్మించాడు సర్ ఆర్థర్ కాటన్. యాభై ఏళ్ల క్రితం నాగార్జున సాగరం కట్టించి ఇచ్చాడు జవహర్‌లాల్ నెహ్రూ. ముప్ప య్యేళ్ల క్రితం శ్రీశైలం రిజర్వాయర్‌ను తన బహు మానంగా అందించింది ఇందిరమ్మ. కెసి కెనాల్ బ్రిటిష్ కాలం నుంచే వుంది. తెలుగుగంగ, హంద్రీ నీవా, గాలేరు, నగరి వంటి పథకాలకు శ్రీకారం చుట్టాడు ఎన్టీ రామారావు. నెట్టెంపాడు, గోరకల్లు, కల్వకుర్తి, జూరాల ప్రియదర్శిని, పులిచింతల, శ్రీశైలం లెఫ్ట్ బ్రాంచ్ కెనాల్, శ్రీశైలం రైట్ బ్రాంచ్ కెనాల్, సోమశిల, స్వర్ణముఖి, కెసి కెనాల్ ఆధు నీకరణ, పెన్నా డెల్టా ఆధునీకరణ, సంపూర్ణ సోమ శిల, తుంగభద్ర, వెలుగోడు, వెలిగొండ... ఇట్లా చెప్పుకొంటూ పోతే లెక్కలేనన్ని ప్రాజెక్టుల నిర్మాణా నికి నాంది పలికాడు వైఎస్.రాజశేఖర్‌రెడ్డి. ఇవన్నీ కృష్ణా నదీ జాలల మీద ఆధారపడినవే. ఇన్ని ప్రాజె క్టులు, ఇన్ని లక్షల మంది రైతులు, ఇన్ని కోట్ల ఎక రాల సాగు భూమి ఇమిడి వున్న జల వివాదంలో ట్రిబ్యునల్ తీర్పు పట్ల రాష్ట్ర ప్రజలు, ప్రభుత్వం ఎంత అప్రమత్తతతో మెలిగి వుండాలి?

## ట్రిబ్యునల్ ఎందుకోసం?

ఒకటికంటే ఎక్కువ రాష్ట్రాలలో ప్రవహించే నదుల నీటిపై ఆయా రాష్ట్రాలు కలహించుకోవడం ఆనవాయితీ అయిపోయింది. బ్రిటిష్ కాలం నుంచే ఎగువ రైతులు, దిగువ రైతుల మధ్య జల కలహాలు సాధారణమై పోయాయి. దీనికి పరిష్కారంగా ప్రభు త్వాలు ప్రవేశపెట్టిన మధ్యస్థం వ్యవస్థ జల వివాద ట్రిబ్యునల్. కృష్ణా, గోదావరి, వంశధార, కావేరి, రావి బీస్, మహాధ్యాయి – మాండ్‌వి నదుల విష యంలో కేంద్ర ప్రభుత్వం ఇటువంటి ట్రిబ్యునల్ ఏర్పాటు చేసింది.

కృష్ణా జలాలకు సంబంధించి మొదటి ట్రిబ్యు నల్ 1969లో నెలకొల్పారు. ఆనాటి సుప్రీంకోర్టు న్యాయమూర్తి బచావత్ దానికి అధ్యక్షుడు. ఆయన ఇచ్చిన తీర్పు బచావత్ అవార్డు పేరిట గత నలభై సంవత్సరాలుగా ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక రాష్ట్రా లకు శిరోధార్యంగా పని చేసింది. ఆ అవార్డు కాలపరిమితి తీరడంతో 2004లో కొత్త ట్రిబ్యునల్ ఏర్పాటు చేశారు. దీనికి అధ్యక్షుడు సుప్రీంకోర్టు న్యాయమూర్తి బ్రిజేష్ కుమార్. ఆయనతో పాటుగా అలహాబాద్ హైకోర్టు రిటైర్డ్ న్యాయమూర్తి ఎస్‌పి.శ్రీవాత్సవ, కోల్‌కత్తా హైకోర్టు రిటైర్డ్ న్యాయ మూర్తి డికె.సేథ్ ఇందులో సభ్యులు. వీరు ముగ్గురూ కలిసి మూడు రాష్ట్రాల వాదనలను ఐదేళ్ల సుదీర్ఘ కాలం విని, తమ తీర్పు ప్రకటించారు.

## తీర్పు శిరోధార్యమా?

జల వివాదాల ట్రిబ్యునల్ ఏర్పాటు రాజ్యాం గంలోని నిర్దుష్ట అధికరణాల ప్రకారం జరుగు తుంది. అది ఇచ్చే తీర్పుకు సంబంధిత రాష్ట్రాలన్నీ కట్టుబడి వుండక తప్పదు. ఈ తీర్పు మీద సుప్రీం కోర్టులో కూడా అప్పీల్ వుండదు. ఏదైనా సవరణ కావాలనుకొంటే, ట్రిబ్యునల్‌లోనే సమీక్ష పిటిషన్ వేసుకోవడం ఒక్కటే మార్గం. తీర్పు కాల పరిమితి నలభై సంవత్సరాలు. ఆనాటికి మరొక ట్రిబ్యునల్ నియామకం జరిగి, దాని తీర్పు వెలువడే వరకు దీన్ని పాటించడం సంబంధిత రాష్ట్రాల విధి. అందు వల్లనే దీనికి అంత ప్రాధాన్యత వుంటుంది. ఒక రాష్ట్రం భవితను బంగారు బాటపై నడిపించగల సత్తా వుంటుంది. అదే సమయంలో ఒక రాష్ట్రానికి మరణ శాసనం లిఖించే స్థోమత కూడా వుంటుంది.

## ఇప్పుడేమి జరిగింది?

1969లో నియమితమైన బచావత్ ట్రిబ్యు నల్ తీర్పు మన రాష్ట్రానికి ఎంతో అనుకూలంగా వుండింది. కృష్ణా నదీ జలాలలో అధిక వాటా ఇవ్వ డమేకాక, మిగులు జలాలను తన ఇష్టం వచ్చినట్లు వాడుకొనే స్వేచ్ఛను కల్పించింది. దానికి తోడు అప్పటికి కర్ణాటక, మహారాష్ట్రలు కృష్ణా నదిపై చెప్పుకోదగిన ప్రాజెక్టులు నిర్మించలేదు కాబట్టి, మన రాష్ట్రంలోని కృష్ణా డెల్టా మన రాష్ట్రానికి అన్నపూర్ణ అన్న పేరును సార్థకం చేసింది. కానీ ఇప్పుడంతా తారుమారై పోయింది.

## ప్రధానాంశాలు

బ్రిజేష్ కుమార్ తీర్పులో ప్రధాన అంశాలు ఇవీ...

నికర జలాల లెక్కింపుకు గత 47 సంవత్స రాలలో నీటి ప్రవాహాన్ని మాత్రమే పరిగణనకు తీసుకొని, అందులో 65శాతం నీటి లభ్యత ఆధా రంగా కేటాయింపులు జరిపారు.

నికర జలాలను బచావత్ అవార్డు ప్రకారమే కొనసాగించి, మిగులు జలాలను అదనంగా పం పకం చేశారు.

కర్ణాటక నిర్మిస్తున్న ఆల్మట్టి రిజర్వాయర్ ఎత్తును 519 మీటర్ల నుంచి 524 మీటర్లకు పెంచు కోవడానికి అనుమతి ఇచ్చారు.

మిగులు జలాలను 285 టిఎంసిలుగా అంచనా వేసి, మూడు రాష్ట్రాలకు పంచారు.

తమకు కేటాయించిన నీటి కంటే అధికంగా వాడుకోవడానికి లేదని కర్ణాటక, మహారాష్ట్రల మీద ఆంక్షలు విధించారు. ఆంధ్రాకు మాత్రం ఆ ఆంక్ష లేదు. తన కేటా యింపు కంటే అధికంగా వచ్చే నీటి మొత్తాన్ని స్వేచ్ఛగా వాడుకో వచ్చు.



సోమశిలకూ నీరు కష్టమే.

నికర, మిగులు జలాలు కలిసి ఆంధ్రకు 1101, కర్ణాటకకు 911, మహారాష్ట్రకు 666 టిఎంసిలు ఇచ్చారు.

నీటి వాడకాన్ని పర్యవేక్షించడానికి కేంద్ర ప్రభుత్వం నేతృత్వంలో నీటి నియంత్రణ సంస్థ ఏర్పాటు ప్రతిపాదించారు.

ఆల్మట్టి రిజర్వాయర్ ఎత్తును 524 మీటర్ల స్థాయికి పెంచుకోవడానికి అనుమతిచ్చారు.

బచావత్ ట్రిబ్యునల్ అవార్డుకు వ్యతిరేకంగా మిగులు జలాల ఆధారంగా ఆంధ్రప్రదేశ్ నిర్మించిన తెలుగుగంగ వంటి ప్రాజెక్టులను గుర్తించడంతో పాటు, వాటికి నీటి కేటాయింపులు జరిపారు.

ఆల్మట్టి నిండేవరకు వేచి వుండకుండా, మొదటగా వచ్చే ప్రవాహం నుంచే ఆంధ్రకు 10 నుంచి 15 టిఎంసిల నీటిని విడుదల చేయాలని ఆదేశించారు. నారు మడుల కోసం ఈ కేటా యింపు.

## మనకు నష్టమా? లాభమా?

ఈ తీర్పుపై రాష్ట్రంలో తీవ్రమైన రాజకీయ రగడ మొదలైంది. తీర్పు వల్ల కృష్ణా డెల్టా ఎడారిగా మారనున్నదని భయపెడుతున్నాయి ప్రతిపక్షాలు. అందుకు వారు చూపుతున్న ప్రధాన కారణాలు ఇవీ...

ఆల్మట్టి ఎత్తు పెంపువల్ల వరదలు లేని సంవత్సరాలలో ఆ రిజర్వాయర్ నుంచి దిగువకు నీరు రావాలంటే అక్టోబర్, నవంబర్ నెలల వరకు సమయం తీసుకొంటుంది. జూన్, జులై నుంచి తొలి వ్యవసాయ సీజన్ మొదలయ్యే కృష్ణా డెల్టాకు ఇది చాలా నష్టం, వ్యవసాయ సీజన్ మారి పోవ డంతో పాటు, నీటి ప్రవాహం తక్కువగా వున్న సంవత్సరాలలో ఒక పంటకు మాత్రమే పరిమితం కావలసి వస్తుంది.

ఆల్మట్టి రిజర్వాయర్ ఎత్తు పెంపకం వల్ల పెన్నా డెల్టాలో నిర్మితమౌతున్న ప్రాజెక్టుల మీద ఆధారపడే నెల్లూరు, కడప జిల్లాల రైతులు తీవ్రంగా నష్టపోతారు. వీరి కోసంగా నిర్మించిన పోతిరెడ్డి పాడు హెడ్ రెగ్యులేటర్ వృధా అయిపోతుంది.

ఇప్పటివరకు దాదాపు 330 టిఎంసిల మిగులు జలాలను స్వేచ్ఛగా వాడుకోవడంతో పాటు, వాటి ఆధారంగా పలు ప్రాజెక్టులు కట్టుకొన్నాము మనం. కానీ ఇప్పుడు ఆ మిగులు జలాలలో తతిమా రెండు రాష్ట్రాలకు కూడా వాటా పంచడం వల్ల, ఈ ప్రాజెక్టులన్నీ కేవలం వరద వచ్చిన సంవత్సరాలలో మాత్రమే ఉపయోగంలోకి వస్తాయి. తక్కినప్పుడు ఎండిపోతాయి. మిగులు జలాల మీద మన హక్కును కొనసాగించి వుంటే, ఈ ప్రాజెక్టులకు ప్రయోజనం కలిగేది.

## మంచి... చెడు...

అయితే నిజంగానే ప్రతిపక్షాలు గోల చేస్తున్నట్లుగా ఈ తీర్పు వల్ల మనకు అంతా చెడే జరిగిందా అంటే, కాదనే చెప్పాలి. కొంత మంచి కూడా జరిగింది. ఆల్మట్టి వల్ల మనకు జరిగే ప్రధాన నష్టం – వానలు పడగానే వచ్చే కొద్దిపాటి ప్రవాహం మొత్తాన్ని వారు నిలిపి పెట్టుకొంటారు కాబట్టి, వరద వచ్చే వరకు మనకు నీరు రాకపోవడం. అయితే ఇప్పుడు ఈ తీర్పు వల్ల, వానలతో వచ్చే నీటి నుంచే 10టిఎంసిలు ఇవ్వా లని ఆదేశించడంతో, నారు మడులు ఆలస్యమయ్యే ప్రమాదం తప్పింది. ఇప్పటివరకు ఎగువనున్న రెండు రాష్ట్రాల దయా దాక్షిణ్యాల మీదనే మనం ఆధారపడవలసి వచ్చేది. వారికి నచ్చిన సమ యంలో మాత్రమే నీరు దిగువకు విడుదల చేసే వారు. ఇక నుంచి నీటి నియంత్రణ బోర్డు వస్తుంది కాబట్టి, న్యాయంగా మనకు రావలసిన నీటిని, రావలసిన సమయంలో తెచ్చుకోవచ్చు. అందువల్ల నీటి పోరాటం తప్పినట్లే లెక్క.

నికర జలాలను 65శాతం లభ్యత ఆధారంగా లెక్కించడం వల్ల, ఎగువన వుండే రెండు రాష్ట్రాలు తమకు కేటాయించిన నీటి కంటే ఒక్క టిఎంసి కూడా అదనంగా వాడుకోకూడదని ఆంక్ష పెట్టడం

కొరవ 14వ పేజీలో

Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/09-11



## ● వివేకాకు

# మతి స్థిమితం తప్పిందా? మదం పెరిగిందా??



అసలే రూరల్ ఎమ్మెల్యే; ఆపైన తమ్ముడికి ఆర్థిక మంత్రిత్వ మనే కల్లు మత్తు తలకెక్కింది; అదుపు తప్పి అవినీతి పిచ్చి పట్టింది; ఆ పైన పత్రికలలో తన అక్రమాల వార్తలు నిప్పులవలె వెలువడడంతో ఆ సెగకు కాలు కాలింది. ఇక ఆయన ప్రవర్తన ఎట్లా వుంటుందో వివరించి చెప్పాలా?

రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి దాదాపు మతిస్థిమితం లేని వాడివలె ప్రవర్తిస్తున్నాడు. దాన్ని మతిస్థిమితం అనాలో, మదం తలకెక్కడమని భావించాలో అర్థం కావడం లేదు. ఆయన మాటలు, చేష్టలు, చర్యలు భరించడం నెల్లూరు ప్రజలకు సహ్యాం కావడం లేదు. గత రెండు వారాలుగా 'జమీన్‌రైతు'లో వరసబెట్టి ఆయన అక్రమాలు, అనుచరుల దుర్మార్గాలను ఎండగట్టడంతో వెర్రెక్కి పోయినట్లు ప్రవర్తిస్తున్నాడు. 'జమీన్‌రైతు' పత్రికను నోరారా శాపనార్థాలు పెడుతున్నాడు. ఆ భాష ఆయన వంటి సంస్కారులు వాడేదేతప్ప, మనబోటి వారం చెప్పుకోగల్గినది కాదు. ఒక శాసనసభ్యుడిగా వుండి బహిరంగ ప్రదేశాలలో, జనం ముందు అంత నీచమైన పదజాలం వాడుతున్నాడంటే, ఆయనకు మతిస్థిమితం తప్పిందనుకోవాలా? మదం పెరిగిందనుకోవాలా? అయితే ఆయన చేసే తాటాకు చప్పుళ్లకు బెదిరిపోయే కుందేళ్లు ఒక్క 'జమీన్‌రైతు'లోనే కాదు, మరే పత్రికలోనూ లేవు. ఆ విషయం రుజువు చేయడానికా అన్నట్లు గత రెండు రోజులుగా ఈనాడు, సాక్షి దినపత్రికలు కూడా వివేకానందరెడ్డి అవినీతి దుర్మార్గాలను తమ పాఠకులకు కళ్లకు కడుతున్నాయి. మునిసిపాలిటీతో మొదలుపెట్టి రాజరాజేశ్వరి దేవాలయం వరకు నగరంలో ఏ సంస్థనూ వదలకుండా వివేకానందరెడ్డి జరిపిస్తున్న స్వాహాకాండను వివరించి చెప్తున్నాయి.

### చెప్పుతో కొట్టాలన్న మహిళలు

పత్రికలే కాదు, నగర ప్రజలు కూడా ఆయన వికార పోకడలతో విసుగు చెంది, తిరగబడే పరిస్థితులు కన్పిస్తున్నాయి. మొన్న ఆదివారం భక్తవత్సల నగర్‌లో ఆ చేదు అనుభవాన్ని రుచి చూపించారు మహిళలు. స్థానికంగా జరిగే మునిసిపల్ పనులను పర్యవేక్షించడానికి వెళ్లిన ఎమ్మెల్యేను అక్కడి మహిళలు స్థానిక సమస్యలపై నిలదీశారు. నీళ్లు రావడం లేదని, రోడ్లు ఛండాలంగా వున్నాయని, మురుగు కాలువలు శుభ్రం చేసేవారు లేరని, దోమల బాధతో నిద్రలేని రాత్రులు గడుపుతున్నామని మొరపెట్టుకొన్నారు. అయితే వారితో ఆయన తన అలవాటు ప్రకారం ఎకసెక్కంగా మాట్లాడారు. ఎగతాళి చేశారు. దానితో రెచ్చిపోయిన మహిళలు, 'జమీన్‌రైతు' పత్రికలో వ్రాసినట్లు మిమ్మల్ని చెప్పులతో కొట్టే రోజులు త్వరలోనే వస్తాయని ముఖాన అడిగేశారు. ఆ దాడికి బిత్తరపోయిన వివేకా తలదించుకొని వెనుదిరిగి వచ్చేశాడు.

దీన్నిబట్టే ఆనం కుటుంబం మీద నగర ప్రజలలో ఎంత ఈసడింపు వుందో అర్థం చేసుకోవడానికి. కానీ విచిత్రం ఏమిటంటే, పత్రికలలో వార్తలు రావడం మొదలైన తర్వాత ఆయన అధికార దురహంకారం మరింత పెరిగి పోయింది. అవినీతి దాహం వీధి స్థాయికి వచ్చేసింది. చింతారెడ్డిపాలెం గ్రామ సరిహద్దులో 70 ఎకరాల విస్తీర్ణంలో ఒక రియల్ ఎస్టేట్ లేఅవుట్ వుందట. దాన్ని చాలా కాలం క్రితం వేశారు. కానీ ఇప్పుడు వివేకా కన్ను దానిపై పడింది. రాత్రికి రాత్రి ఫెన్సింగ్ రాళ్లు, ప్లాట్లను గుర్తించే రాళ్లను మునిసిపల్ సిబ్బంది వెళ్లి పగలగొట్టారు. ఆ రియల్ ఎస్టేట్ యజమాని లబోదిబోమంటూ తనను ఆశ్రయించడంతో మాగుంట లేఅవుట్‌లో 100 అంకణాల స్థలంకొని, నేను చెప్పిన వారి పేరుమీద రిజిస్టర్ చేయించు, నిన్ను వదిలేస్తా అని బేరం పెట్టాడట. దాదాపు మూడు కోట్ల లంచం అన్నమాట. వివేకా మాట కాదంటే, ఈనాడు పత్రిక వ్రాసినట్లు తాను మటాష్ అయిపోవడం ఖాయమని తెలుసు కాబట్టి, ఆ రియల్ ఎస్టేట్ సంస్థ అందుకు అంగీకరించింది. పగిలిన రాళ్ల స్థానంలో మళ్లీ కొత్త రాళ్లు వెలిశాయి.

చిల్డ్రన్ పార్క్ రోడ్‌లో మరొక రియల్ ఎస్టేట్ ప్రాజెక్ట్‌కు అడ్డంగా శివాయి భూమిలో ఫెన్సింగ్ వేసి, దారి లేకుండా చేయించాడు వివేకానందరెడ్డి. అందుకు కారణం వారికి ఆకుతోటల దగ్గరున్న భూమిని తనకమ్మమని బెదిరించాడు. దాదాపు 150 కోట్ల రూపాయలు విలువ చేసే భూమి అది. చవకగా తనకివ్వమన్నాడట. అయితే దాన్ని అమ్మడం ఇష్టం లేదని చెప్పడంతో వారి మీద కత్తి కట్టి, వారి ఇళ్లస్థలాలకు రోడ్ లేకుండా చేసి పారేశాడు. టౌన్‌లో ఒక కళ్యాణ మండపం మీద వివేకా కన్ను పడింది. అన్ని అనుమతులూ వున్నా, మునిసిపల్ సిబ్బంది వెళ్లి గోడలు

కొరవ 14వ పేజీలో

### కార్టూన్ స్కేప్






## ● రాజరాజేశ్వరమ్మను...

# దోచేస్తున్న సన్నపరెడ్డి పెంచలరెడ్డి!

### గుడులను సైతం తన అనుచరుల అక్రమాలకు నిలయాలుగా మార్చడంలో వివేకాకు ఏ సంతోషం కల్గుతుందో?



మహిమలు కల్గిన తల్లి రాజరాజేశ్వరమ్మను ఆనం సోదరుల అధికార దర్పం ఆసరాతో వారి అనుచర ముఖ్యుడు సన్నపరెడ్డి పెంచలరెడ్డి దోచుకొన్న తీరు చూస్తుంటే, మన రాజకీయవాదులకు దేముడంటే కూడా ఇంత చులకనా అన్న ఆశ్చర్యం కల్గుతున్నది. నిద్ర లేస్తే కనపడిన గుడులన్నిటి చుట్టూ తిరుగుతుంటాడు ఆనం వివేకానందరెడ్డి. చర్చి, మసీదులను కూడా వదలి పెట్టడు. నుదుటి మీద చారడంత విభూతి బొట్లు పెట్టి మరీ తన భక్తి ప్రదర్శిస్తుంటాడు. అది నిజమైన భక్తి అయి వుంటే, తన పేరుతో తన అనుచరులు గుడులను, వాటిలోని లింగాలను కూడా దిగమ్రింగుతుంటే చూస్తూ వూరుకుండలేరు.

కెవి.రాఘవరెడ్డి నడిపినన్ని రోజులు రాజేశ్వరమ్మ గుడి ఎంతో నియమబద్ధంగా నడిచింది. అమ్మవారి మీద భక్తి వున్నవారు ఎంతో నమ్మకంతో అభివృద్ధి పనులకు నిధులిచ్చేవారు. వాటిని సంపూర్ణంగా వినియోగంలోకి తెచ్చేవారు. కానీ ఇప్పుడంతా అందుకు విరుద్ధం. అమ్మవారికి ఏ భక్తుడు ఏ మొక్కు చెల్లించాలన్నా సన్నపరెడ్డి పెంచలరెడ్డి చేతిలో డబ్బు పెట్టాల్సిందే. ఆయనే ఆ పనులకు కాంట్రాక్టర్. ఖర్చు ఆయన ఇష్టం. దేనికీ లెక్కాపక్కా వుండదు. ఒక్క ఆల్తూరు ఆదినారాయణరెడ్డి కుటుంబం మాత్రమే తాము చేపట్టదలచిన అమ్మవారి సేవలకు తామే బాధ్యత వహించి, తమ పర్యవేక్షణలోనే నిర్మాణాలు చేయిస్తున్నది. గత ఐదారేళ్లలో ఆల్తూరు ఆదినారాయణరెడ్డి ఆయన కుమారులు కలిసి రాజరాజేశ్వరి గుడిలో చాలా నిర్మాణాలే చేశారు. గాలి గోపురం, అనిఒట్టి మండపం, పూజ సామాను అమ్మే అంగడి విస్తరణ, ద్వాదశ జ్యోతిర్లింగ విగ్రహం, సుందరేశ్వర స్వామి గుడి, దానికి అదనంగా ధ్వజస్తంభం, నూతన కార్యాలయ భవనం, వాహనశాల, అమ్మవారికి ముఖ మండపం, అమ్మవారికి ధ్వజస్తంభం, సుందరేశ్వర స్వామి విద్యుత్ మంగళ వాయిద్య మండపం ఇట్లా

కొరవ 14వ పేజీలో





Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.